

## సంక్రాంతి సంచిక

ముగ్గు వేయబోవు—ముగ్ధకై మోహన
బేయి చూచు మగని—కాయు మంచు
కార్యదీక్ష,బావను— కాంతయూ రమణుని
ఆకు దాసుడయ్యె— నని దలంచు.

డాక్టరు నమ్మిట శ్రీనివాసరావు (విశాఖపట్నం)

* * *

ప్రముఖ కార్టూనిస్టు కార్టూనును ముఖచిత్రంగా ప్రచురించి ఆంధ్రపత్రిక వీక్లీ ఒక నూతనత్వాన్ని సంతరించుకుంది. ఈ సంక్రాంతి ప్రత్యేక సంచిక చాలా ఆకర్షణీయంగా వుంది. ముఖ్యంగా సంక్రాంతి పర్వదినానికి సంబంధించిన కార్టూనులు చాలా బాగుండి మమ్మల్ని కడుపుబ్బ నవ్వించాయి. సినీనటుడు, రచయిత, కవి శ్రీరంగనాద్‌గారి కథానిక 'చేతిలోని యే రేఖా చెప్పలేక పోయింది. చాలాబాగుంది.

పి. వి. రామనాథరావు, ఎస విజయశ్రీ, హేమలత, శ్రీదేవి (మధిర)

* * *

సంక్రాంతి సంచిక ముఖచిత్రం చాల బాగుంది. వి. వాణిప్రసాద్‌గారి 'విరితావి' నచ్చింది. మరియు ప్రముఖ సినీనటుడు రంగనాద్‌గారి 'చేతిలోని యే రేఖా చెప్పలేకపోయింది.' బ గుంది.

కొప్పె నారాయణరావు (తాడిపత్రి)

* * *

'బాబు' కార్టూనతో వెలువడిన సంక్రాంతి సంచిక సంక్రాంతి కార్టూన్లతో మమ్మల్ని నవ్వించి పండగకు ముందే మాకు నవ్వుల విందు చేసింది. కార్టూన్స్ మాత్రం భలే సరదాగా ఉన్నాయి.

ఈ వారం మొదలెట్టిన పెద్దకథ 'పెన్‌ఫ్రెండ్' మాంచి సస్పెన్సులో ఆపేశారు. నటుడు రంగనాద కథ చాలా బగుంది.

యు. యు. ఉరుకుందు (ఎమ్మిగనూరు)

22.1 82 సంచికలో బాబుగారి "ముగ్గు ముచ్చట్లు" కార్టూను చాలా బాగున్నది. ఈ సారి కథలు అన్నీ ఆశక్తిగావుండటం విశేషం.

సంక్రాంతికి ప్రత్యేకముగా ప్రచురించిన కార్టూనులన్నీ మమ్మల్ని కడుపుబ్బ నవ్వించాయి. చూపిన కార్టూను మళ్లీ, మళ్లీ చదివించేలా చేశాయి! ఈసారి కార్టూనులకు ఎక్కువ ప్రాధాన్యతను ఇచ్చినందులకు మీకు మా కృతజ్ఞతాభివందనములు.

టి. వి. శ్రీనివాసరాజు, టి. వి. విజయరామరాజు (ఇల్లందుల

* * *

22.1.82 నాటి ఆంధ్రపత్రిక ముఖచిత్రం 'ముగ్గు ముచ్చట్లు' నాకెంతో నచ్చింది. ముఖ్యంగా కార్టూన్ చాల హాస్యంగావుంది. బాబు'గారి చిత్ర రచన కూడ బావుంది. ఈ సంచికలోని కార్టూన్లు కూడ బాగా నవ్వించాయి

హెచ్. శేషశాయి (అనంతపురం)

* * *

ఈవారం ప్రారంభించబడిన పెద్దకథ 'పెన్‌ఫ్రెండ్'చాలాబావుంది మంచిసస్పెన్స్‌లో పెట్టారు. త్వరలోనేసరికొత్తసరిగుల్ ప్రకటన చూసి చాలా ఆనందించాం. నటుడు రంగనాద్‌గారి కథ చాల బ వుంది వారుముందుముందు కూడా మంచి కథలు వ్రాస్తారని ఆశిస్తున్నాను. సీరియల్స్ రెండూ చాల ఇంట్రెస్టింగ్‌గా సాగిపోతున్నాయి.

జి బ లాజీ (కొంగరెడ్డిపల్లి

"ముగ్గు ముచ్చట్లు" ముఖచిత్రంతో వెలువడిన సంక్రాంతి సంచిక విస్పురన కాంతులతో శోభిల్లితమై మా మందు వారి మా హృదయాలనే దోచుకుంది. పెన్‌ఫ్రెండ్ పెద్దకథ నాకెంతో తృప్తినిచ్చింది ఎంతో ఇంట్రెస్టుగా వుంది ముందు ముందు కథ మరింత హృద్యంగా వుంటుందని భావిస్తున్నాను. తార సీరియల్ జీవితంలో మరవలేని మధురానందాన్ని అందిస్తోంది ఇంత మంచి సీరియల్ చదవడం నిజంగా ఒక అదృష్టంగా భావిస్తున్నా ఈ వారం సినిమా విశేషాలు ఎంత తాజాగా ఉన్నాయి.

కందిగట్ల ప్రభాకర్ (జనగామ)

* * *

22 1 82 సంక్రాంతి సంచికలో కథలన్నీ బాగున్నాయి మామెతో నచ్చింది జీవితంలో కొత్తగాలి, తార సీరియల్స్ చాలా ఇంటరెస్టింగ్‌గా ఉన్నాయి

చిందం భీమయ్య (గర్మికుర్తి)

* * *

'చేతిలోని ఏ రేఖా చెప్ప లేక పోయింది' కథలో నటుడు రంగనాద్‌ను మొదటి సారిగా మా రచయితగా పరిచయం చేసినందుకు అభినందనలు. రచనాశైలిలో కూడా ఎంతో కొత్తదనం ఉంది. "హేట్సాఫ్ టు రంగనాద్'

ఆర్. రఘురామ్ (హైదరాబాద్)

* * *

రంగనాద్ నటుడే అనుకొన్నా ఇన్నాళ్లు, గాని మంచి రచయిత అని తెలుసుకొన్నాను వారి కథ మీ పత్రికలో (22-1-82) చదివి కథ చిన్నదే అయినా మంచి శైలిలో వుండి నన్ను ఆలోచింప జేసింది.

చెట్టి (భువనేశ్వర్)

* * *

22—1—82 సంచికలో సినీ నటుడు, రచయిత,టి యస్ యాన రంగనాద్ కథ చదివి సంతోషపోయాం రంగనాద్ వ్రాస్తారని తెలుసు కానీ యింత చక్కగా కథలు కూడా వ్రాస్తారని అనుకోలేదు. భవిష్యత్తులో కూడా రంగనాద్ రచనలు మావంటి పాఠకులకు తప్పక అందిస్తారనే ఆశిస్తాము. త్రీ చీర్స్ టు రంగనాద్.

సాయి, వెంకట్, చిన్న సికింద్రాబాద్.

* * *

సంక్రాంతి సంచికలో దీపావళి కథలపై పాఠకుల బ్యాలట్ ఫలితాలలో బహుమతి గ్రహీతల పరిచయాలు వేస్తూ "పచ్చతోరణం"రచయిత శ్రీ శివల జగన్నాధరావు 1966లో జన్మించారు అని పడింది అది సరికాదని 1966 సం.లో రచయితగా ,విశాఖపట్నం, డాబా తోట, శారదావీధిలో పుట్టారు అని తెలుపు కొంటున్నాను.

అదనపు బహుమతులు పొందిన సోదర రచయితలక అందరికి, నా హార్టీ కంగ్రాట్యులేషన్స్.

శివల జగన్నాధరావు (విశాఖపట్నం)

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938—1972]
శుక్రవారం : 12-2-'82
దుర్మతినామ సం. మాఘ. బ. ఏవిది
సంపుటము 75 : సంచిక 23

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్ట్‌లో ఏడాది చందా రు. 67-60
ఆరు మాసాల చందా రు. 33-80
విడిప్రతి వెల రు. 1-25 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ—520 003


## విషయానుక్రమణిక





## లోకం పోకడ












# ఫాలాక్షుని డైరీ

## బయటపడ్డ బండారం!

ఆదిలాబాదుకు చెందిన డిస్ట్రిక్ట్ సెషన్స్‌కోర్టు న్యాయమూర్తి తాను గిరిజనుడనని తప్పుడు సర్టిఫికెట్ పెట్టి, తత్ఫలితంగా గిరిజనులకు వచ్చే సదుపాయాలన్నీ పొందుతున్నారట. ఈ సంగతి ఆంధ్రప్రదేశ్ శాసన మండలి సభ్యురాలు శ్రీమతి సంతోషమ్మ బయటపెట్టారట.

## అసాధ్యమైన జబ్బులు!

సలింగ సంపర్కంవల్ల పురుషుల జంటలకు కాళ్ళ, పొట్టవంటి భాగాలలో కాన్సరువచ్చే ప్రమాదమున్నదట. పురుషులతో పురుషులు లైంగిక వినోదం పొందడం ద్వారా అనూహ్యమయిన జబ్బులు వస్తున్నాయనీ, ఆ వ్యాధులు కుదర్చడం దుస్సాధ్యంగా తయారవుతోందనీ న్యూఇంగ్లండు జర్నల్ ఆఫ్ మెడిసిన్ అనే పత్రిక వ్రాసిందట. అయితే పురుషులతోపురుషులు లైంగికక్రీడలవల్ల పురుషులకువచ్చే భయంకర వ్యాధుల వంటి వ్యాధులు స్వలింగ సంపర్కం చేసుకునే స్త్రీలకు రావడం అరుదని కూడా ఆ పత్రిక రాసిందట— ఏమిటో గోల!

## వ్యభిచార గృహం పాలైన నటి!

మరాటీ నాటకనటి ఉషా సబ్‌నీస్ తన రెండేళ్ల కొడుకును తీసుకుని పూనా వెళ్లిందట. పూనా స్టేషనులో కొందరు ఆగంతకులు ఆమెను బలవంతంగా లాక్కుపోయి ఓ వ్యభిచార గృహానికి అమ్మేశారట. ఆమె కొడుకు అనాథగా ఆ స్టేషనులో స్పృహతప్పి పడివుంటే ఓ రైల్వేపోలీసు పెంచుకోడానికి తీసుకున్నాడట. ఆమె ఆ వ్యభిచార గృహం నుంచి తనను రక్షించమని తన తల్లికి ఓ ఉత్తరం రాసిందట. ఆ ఉత్తరం పూనా రైల్వే మేజిస్ట్రేటు కోర్టులో ఓ న్యాయవాది దాఖలుచేసి, ఆ ఉషాసబ్‌నీస్‌ను విడుదల చేయమని సదరు కోర్టును కోరారట.

## కారణం తెలియని ఘాతుకం!

మధురకు చెందిన వత్తల్‌గుండు అనే వూరిలో 45ఏళ్ల బోసైముత్తు అనే అతను జూన్ 2వ తేదీ అర్ధరాత్రి పచ్చడిబండతో తన భార్య 35 ఏళ్ల కామాక్షి తలపగలగొట్టి, నిద్రపోతున్న 15 ఏళ్ల కూతురు నిర్మల మీద, 8ఏళ్ల సెల్వి, 12 ఏళ్ల విజయ మీద కిరసనాయిలు పోసి నిప్పంటించి, తాను నల్లుల మందు త్రాగి, అంతతో సంతృప్తి చెందక మీద కిరసనాయిలు పోసుకున్నాడట. భగభగ గగనానికి లేచిన ఆ మంటలలో మొత్తంకుటుంబమంతా మసి అయిపోయిందట. అతను తరచుగా భార్యతో పోట్లాడి, ఆమెను కొట్టేవాడట. ఇంత ఘాతుకానిక్కారణమేమిటో తెలియలేదు.

## తండ్రిని దారుణంగా పొడిచి చంపిన తనయుడు!

ఉదకమండలానికి చెందిన మాతోరతి అనే వూరిలో 86 ఏళ్ల నారాయణ గౌండరు అనే ఆయన పొలం అతని కొడుకు రామన్ గౌండరు సేద్యం చేసేసరికి ఆ నారాయణ గౌండరుకు కోపం వచ్చి 'బుద్ధిలేని గాడిదా, నా పొలంలో నిన్నెవడ్రా పని చెయ్యమన్నది' అని అరవంలో తిట్టాడట. దానితో రామన్‌కు కోపంవచ్చి రొట్టె కోసుకునే కత్తిపెట్టి తన తండ్రిని కసకసా పొడిచి,చంపేసి తాను పరారై పోయాడట— పోలీసు లొదలద్దూ

## ప్రేమకి, పెళ్ళికి భీమా!

ప్రేమ భీమా, వివాహ భీమా అనే పదాలు పుట్టబోతున్నట్టున్నాయి. దీని ప్రకారంఒక మగవాడొహ అమ్మాయిని ప్రేమించగానే ఆమెను తాను న్యాయం చేయునని భీమా చెయ్యాలట. ఆ విధమైన హామీని భంగపరిస్తే అతనికి వెంటనే అయిదేళ్ళ జైలు శిక్ష విధించాలట. వివాహ భీమా పథకం ప్రకారం తన కొడుకు పెళ్ళి చేయదల్చిన ప్రతి తండ్రి నెలకు 30 రూపాయలు ప్రీమియం కట్టే పద్ధతిలో ఒక పాలసీ తీసుకోవాలట. ఆ పాలసీని నిబంధనలననుసరించి వారు ఇంటికి వచ్చిన కోడలును చక్కగా చూసుకోవాలట. తప్పితే ఆమెను వెంటనే ఆ పాలసీ వల్ల విడాకులు, భరణం కూడా రావాలట. ఈ రెండు రకాల భీమాలు అత్యంత అవసరాలని పూనాకు చెంది ఎస్.వి. కొటారి ఒక లేఖలో ప్రధాని శ్రీమతి గాంధికి తెలియజేశారట.

## అక్రమానికి పాల్పడ్డ అధికారి!

సినీ నటి విజయశాంతి యింటికి (మద్రాసు) ఒకతనువచ్చి తాను సి.బి.ఐ. ఆఫీసరునని, కేరళ సినిమా నిర్మాత ఒకాయన హత్యలో ఆమెకు సంబంధం వున్నదనీ, అనుమానం మీద శోధనకు వచ్చాననీ ఆమె యిల్లంతా కెలికి ఆనక ఆమెను తెల్ల కాగితం మీద సంతకం చెయ్యమని, చివరికి మీకేం సంబంధంలేదని రాష్ట్రపతికి సిఫార్సు చేయాలంటే నాకెంతిస్తారని అడిగాడట. విజయశాంతికిఅనుమానం వచ్చి పోలీసులకు తెలియజేస్తే వాళ్లొచ్చి అతన్ని అరెస్టు చేశారట. అతను ఓ విమాన దళ అధికారిట. ఆ దుస్తులలో వచ్చి డబ్బు గుంజుదామని యత్నించాడట. పేరు స్టీఫెన్ అట. ఢిల్లీలో వుద్యోగిట. కోటివిద్యలు కూటి కొరకే!

## ఆత్మక్షోభకి గురిచేసిన అన్నదమ్ములు!

మద్రాసు తాంబరం అనే ప్రాంతానికి చెందిన స్వయంభు నాడార్ అనే ఆయన అక్కడ ఓ చిన్న షాపు పెట్టుకుని భార్యను, ఆరుగురు పిల్లలనూ పోషించుకుంటూన్నాడట. ఈ వ్యాపారంలో అతనికి తన బావమరదులతో పోట్లాట వచ్చి అది కక్షగా రూపొందిందట.దాంతో అతను తంజావూరులో స్థిరపడే ప్రయత్నం చేసి, కుదిరాక కుటుంబాన్ని తీసుకు వెళ్తానని చెప్పి తంజావూరు వెళ్లాడట. అతను వూళ్ళో లేకుండ చూసి అతని యిద్దరు బావమరదలూ ఆ స్వయంభునాడారు భార్య 35 ఏళ్ల రంజిత పుష్పాన్ని నానా బాధలూ పెట్టనారంభించారట.తోబుట్టువులేఅంతబాధలు పెడుతుంటే యిహ బ్రతకనేల అని మొన్న 3వ తేదీ అర్ధరాత్రి అయిదు నెలల పసికందును, ఆరేళ్ల ఎడపిల్లనూ తీసుకుని వూరుచివర చెరువులో పసిపిల్లను పడేసి ఆరేళ్ల పిల్లను చీరలో చుట్టేసుకుని తాను దూకేసిందట. పొద్దున్నే చేపలు పట్టబోయిన ఒకతని గేలానికి ఆమె చీర తగులుకుని శవం బయటపడిందట— ఆత్మహత్య చేసుకునేంత ఆత్మక్షోభను పెట్టగలిగినవారు ఆత్మీయులేకదా!



పెవిలియన్‌లో విజిటర్సు గాలరీ జనంతో నిండి పోయింది. కుడిచేతి వైపు గర్ల్ స్టూడెంట్సు, ఎడంచేతివైపు నాటీబోయ్ స్టూడెంట్సు. రెండు టీముల ప్లేయర్స్ పరస్పరం కరచాలనాలు చేసుకున్నారు.



అంపైర్ టాస్ వేసేడు. మొదటిసారి బ్యాటింగ్ ఛాన్స్ మెడికల్ కాలేజీ టీముకు వచ్చింది. ఓపెనింగ్ బాట్స్‌మెన్‌గా ఆనంద్, రాజులు, వికెట్స్ వేసి నడిచారు - ఆర్ట్స్ కాలేజీ టీమ్ ఫీల్డర్స్‌గా తమ తమ పొజిషన్లు తీసుకున్నారు - ఫస్ట్ ఓవర్ బౌలింగ్ వినాయక్ ది.

వికెట్ కీపర్ రాజన్‌కి సంజ్ఞ చేసి అంపైర్ విజిల్ విని బాల్ వేయడానికి ముందుకురికేడు. మొదటి రెండు బాల్సను డిఫెన్సు ఆడాడు ఆనంద్. మూడవది ఫుల్‌టాస్. అనుకోని ఈ మార్పుకి ఆనంద్ క్షణకాలం ఆశ్చర్యపడ్డట్టు కనుపించినా,

కట్‌వర్డ్గా కొంచెం తిరిగి బాల్‌ని ఫేస్ చేసేడు. వినాయక్ ఫాస్ట్ బౌలర్ కావడంతో స్ట్రోక్ చిన్నదే అయినా బౌండరీ అయింది. కరతాళధ్వనులతో పెవిలియన్‌కి కొత్తకళ వచ్చినట్టయింది. మెడికల్ కాలేజీ టీమ్ బికౌంట్ బౌండరీతో స్టార్టయింది.

"ఏయ్! ఆనంద్ ఏ సంవత్సరమే!" అడిగాను, ప్రక్కనే ఉన్న మేరీని—మేరీ మెడికల్ కాలేజీలో హౌస్ సర్జన్. వినాయక్ పరుగు, బాల్ వేయడం చూడ్డంలో మునిగున్న మేరీని డిస్టర్బ్ చేశానా అనిపించింది దాని వంక చూస్తే.

"ఆ ఏమిటన్నావ్! ఆనందా! థర్డ్ ఇయర్‌లో ఉన్నాడు."

ఆమె మాటల్లో ఆమెకు సహజమైన ఉషారులేదు, పొడిగా సంభాషణ పెంచడం ఇష్టంలేనిదానిలా త్రుంచినట్టు చెప్పి ఊరుకుంది.

ఆమె చూపులు వినాయక్‌నే వెంటాడుతున్నాయి.

ఆట చూడ్డంలో మునిగిపోయాను— ఆట ఆ రోజుకు ముగిసేసరికి మెడికల్ కాలేజీ టీము స్కోరు ట్వెంటీఫైవ్ ఫర్ ఫోర్, ఆనంద్ ఆడుతూనే ఉన్నాడు.

"మేరీ! మళ్ళీ మీ హాస్టల్ వరకూ ఏం వెళ్తావు కాని, ఈ రాత్రికి మా రూములో ఉండిపోకూడదూ? ఇక్కడికి నాలుగడుల దూరం మా హాస్టలు" కలిసి చదువుకున్న ఇంటర్మీడియట్ నాటి రోజులు గుర్తుకు తెచ్చుకుంటూ మేరీతో అన్నాను.

## జీవనపత్రం కానికటు

"నాకు రేపు పొద్దునే ఇ. యన్. టి. ఓ. పి..."

"హలో మేరీ! గేమ్ కొస్తున్నట్టు చెప్పలేదేం?" అలసటగా ఊపిరి తీస్తూ ఆయాసపడుతూ బౌలింగ్ స్పీడులో వచ్చాడు వినాయక్. మనిషి దృఢంగా ఉన్నాడు. తీర్చి దిద్దినట్టున్న ముఖంలో పసితనం కొట్టొచ్చినట్టు కనుపిస్తోంది. అతన్ని చూసిన వెంటనే ఎందుకో నాకు జాలి కలిగింది. మధ్యతరగతి కుటుంబంలో పదిమంది మధ్య పెరిగి జీవితంలో సుఖాలు కంటే కష్టాలు, హాయి కన్న బాధ్యతలు, స్వేచ్ఛకన్న బంధనాలే ఎక్కువని నాకు జ్ఞానం వచ్చినప్పటినుంచి మనసులో నాటుకుపోవడం చేత నా మనసు మరీ సులభంగా కరుగదు. ప్రేమ, అనురాగం, మమత కంటె ఉద్రేకాలు అరుదుగా అదేనా తాత్కాలికంగా మాత్రమే నా మనసులో చోటు చేసుకోగలిగేవి.

అతను దగ్గరవుతున్న కొలది మేరీ ముఖంలో లేత గులాబీరంగు క్రమంగా చోటు చేసుకోవడం గమనించాను. తెలుగు విద్యార్థినిని కావడంతో పరిశీలనము పదాలల్లోకి మార్చే ప్రయత్నాలకు అలవాటు పడిపోయాను.

"అనుకోకుండా రావడం అయింది, ఈ టీములో నువ్వుంటావన్న సంగతే నాకు తెలీదు!" అంది మేరీ. అది అబద్ధం ఆడుతోందని పసికట్టడానికి ఆడదాన్నే అవనవసరం లేదు.

"మీ టీమ్‌కి హేట్స్ ఆఫ్ మా పీస్ బౌలర్ ఈ రోజు "మందు" పార్టీ అని ఆటకు రావడం మానేశాడు. సెకండ్ బెస్ట్‌గా నన్ను లాక్కొచ్చారు. ఈ మధ్య నాకు ప్రాక్టీసు లేదు అడక. అయినా అడిగితే కాదనలేక సబ్‌స్టిట్యూట్‌గా వచ్చాను, బౌండరీస్ సిక్సర్స్ చాలానే ఇచ్చాను."

అతని మాటల్లో ఆమెతో మాట్లాడ్డమే పెద్ద అవకాశం అన్న సంతోషం, సంతృప్తి వచ్చిన అవకాశాన్ని వదులుకోకూడదనే ఆత్రుత కనిపిస్తున్నాయి. ముఖంమీద చిరునవ్వు చెదరకుండా అతి ఫాస్ట్‌గా మాటలు బౌల్ చేస్తున్నాడు. కొత్తగా ఆట కొచ్చిన బాట్స్‌మన్‌లా ఉంది మేరీ పరిస్థితి.

"రేపు పొద్దున్న ఇ. ఎన్. టి ఓ పిలో ఉంటా. బాయ్!" అని నా చేయి పట్టుకుని ముందుకు నడిచింది. దాని ప్రవర్తన నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. వినాయక్ ముఖంలో చిరునవ్వు స్థానే నిరుత్సాహం అలముకుంది. అతన్ని చూస్తే క్రిష్ణశాస్త్రి కవిత్వంలో "వేణు" గుర్తుకు వచ్చాడు.

కొంత దూరం నడచిన తర్వాత, "ఏమే మేరీ! అన్ని బాల్స్ అతను వేస్తే ఒక బౌండరీ ఐనా చేయకుండా పంపించేశావు?" అన్నాను నవ్వుతూ. మా క్రికెట్ ఫేన్సు పరిభాష అది. బౌండరీ అంటే చిన్న ఉపన్యాసం, సిక్సర్ అంటే ఎదుట వాడికి బోరు కొట్టేవరకూ ఆగని ఉపన్యాసం. బాల్సును వేసేది బోయ్ ఫ్రెండ్, బాట్ చేసేది అమ్మాయి. బాటింగ్ స్ట్రెంత్‌నుబట్టి మాట్లాడేది ఉత్తపక్షిలా, ప్రేమపక్షిలా అన్నది నిర్ణయింపబడుతుంది. ఓహో, ఎన్ని వన్‌వే ట్రాఫిక్‌లనుపట్టేసేమో మా పద్ధతితో, రోల్స్ రివర్స్ అయితే అది వన్‌వే ట్రాఫిక్ లవ్. ఆ బోయ్ టైమ్‌ను వేస్టు చేస్తున్నట్టే, ఇన్నింగ్స్ డిఫీట్ ఖాయం. అది అడిగినదానికి జవాబు చెప్పలేదని గుర్తించాను. దానికిష్టం లేనప్పుడు మాట్లాడించడం అసాధ్యమని గుర్తుకు తెచ్చుకున్నాను.

అయనోస్ఫియర్ లాబ్స్ దాటి హాస్టలుకు వెళ్ళే రోడ్డుమీద నడుస్తున్నాం. చిరుచీకటి కమ్ముకుంటోంది. స్టాఫ్ క్వార్టర్సులో పాలను పితకడానికి గేదెల్ని తోలుకు వెడుతున్నారు. కిర్లంపూడి లేఅవుట్‌లో హౌసెస్ కేసి చూస్తూ నడుస్తోంది మేరీ. కట్టడం పూర్తయిన యిళ్ళు చూడ్డానికి ఇప్పుడే



## జీవనపట్టు కానికట్టు

బావున్నాయి. కన్‌స్ట్రక్షన్ ఇంకా పూర్తవని ప్రామిసింగ్‌గా కనుపిస్తున్నాయి.

"ఈ ఏరియాలో ఇళ్లు సుపర్బ్, వాట్ డు యు సే?"

టాపిక్ మార్చడానికి ప్రయత్నిస్తోందన్న విషయం స్పష్టంగా తెలుస్తోంది. "ఛల్ ఉడ్ జారే పంఛీ..." మహమ్మద్ రఫీ పాట బోయ్స్ హాస్టల్ నుంచి వినిపిస్తోంది.

"ఈ సంజీవయ్య కాలనీ అంతా అప్పర్ ఇన్‌కమ్ గ్రూప్‌కి టవున్ ప్లానింగ్ ట్రస్టు ఎలాట్ చేసిన సైట్లమీద కట్టిన ఇళ్ళే. రాజా పోతులా వున్నాడని ఇవి సుపర్బ్‌గా ఉండక మరెలా వుంటాయే! సామ్యవాదం గురించినదంతా ఉపన్యాసాలకు, సినిమాపాటలు రాసేవాళ్ళ పేదల మ్రగ్గు రూతలూగించే కవిత అల్లడానికి! పేదలు లేందే..."

"అబ్బ! స్టాప్ యువర్ సిక్సర్! నీలాంటి వాళ్ళని పేషల్ విత్ గ్రీన్ ఐజ్ అంటారు. నీకు లేదని జెలసీ, కూలివాడు లేకుండా శ్రామికవర్గం లేకుండా ఇళ్లూ లేవవ్వూ, పరిశ్రమలు పని చేయవు. సొసైటీ ఆఫర్స్ ఈక్వల్ అపర్చ్యునిటీస్ టు బికమ్ వాటెవర్ హి లైక్స్, ఈక్వల్ అపర్చ్యునిటీ ఈజ్ ది ఎసెన్స్ ఆఫ్ డెమాక్రసీ అండ్ సోషలిజమ్ అండర్ డెమోక్రసి..."

"ఆపవే నీ బౌండరీ! వీధిబడి నుండి హైస్కూలుకు వెళ్ళడానికి నిరుపేదలలో ఎంతమంది కవకాశం ఉందే, వాళ్ళలో కాలేజీ చదువు అదృష్టానికి నోచుకున్న వాళ్ళెందరో, ఇంక యూనివర్సిటీ చదువు వేరే ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. ఏవీటే! ఆ ఈక్వల్ అపర్చునిటీస్? జీవన పరుగు పందెంలో ఐయల్దేరే ప్రదేశాల మధ్య యోజనాల దూరాలు..."

"కేకవెయ్యకు! అటుచూడు..."

త్రాగిన వాళ్ళు ఇద్దరు దెబ్బలాడుకుంటు న్నారు. వాళ్ళ మామూలు మాటలు జుగుప్స కలిగించేవి. చూసి మేరీ కేసి తిరిగాను.

"తెల్లారి లేచింది మొదలు ప్రజల్లో అన్ని తరగతుల ప్రజలను చూస్తూ ఉంటామే. ఆ త్రాగుడు వాడు మానేస్తే, మానేయదలిస్తే హైయర్ ఎడ్యుకేషన్ వాళ్ల పిల్లలకు చెప్పించలేనిదేం కాదు ఈ రోజుల్లో. ఉన్న అంతరాలను కాదనను, అవి తగ్గించడానికి ప్రభుత్వం తాపత్రయపడడమే కాని పేద ప్రజలు వాళ్ళ అభివృద్ధి గురించి వాళ్ళు ఆలోచిస్తున్నారా? వాళ జీవన విధానాలను మార్చుకుని కుటుంబంలో పిల్లల చదువుకని ఆసక్తి చూపిస్తున్నారా? వీళ్లైన పేదలు కూడా పిల్లలను కనడంలో చూపే ఆత్రుత ఆ పిల్లల భవిష్యత్తు గురించి ఆలోచించడం లేదు. ఈ పేద కుటుంబాలలో స్త్రీలే నయం, కొంతలో కొంత పిల్లల చదువుమీద ఆరోగ్యం గురించి శ్రద్ధ చూపిస్తున్నారు — తన్నుతాను బాగుచేసుకునేందుకు ప్రయత్నించని మనిషికి ఆ దైవం కూడాతోడ్పడలేడు...

ఏవిటే మీ హాస్టల్ బిల్డింగ్ ముందు లైట్ లేదు?"

"లైట్ పోయిన తర్వాత కొన్నిరోజులైనా పోనిదే పోయిన బల్బును మార్చడం జరగదులే..."

"అబ్బ! తెలుగు స్టూడెంట్ అనిపిస్తావే మాట్లాడే ప్రతివాక్యంలో..."

"ఏం ఓయ్! "షోలే" సినిమాకెళ్దామని మూడు రోజుల నుంచి ప్రామిస్ చేస్తూ ఎగ కొడుతున్నావు" ఫిలాసఫీ స్టూడెంటు రాధతో హిందీ ఎం ఏ. చేస్తున్న విమల అంటూ వచ్చింది మెట్లదగ్గరకూర్చున్న ఆమెదగ్గరకు. మా చిన్న హాస్టల్లో సినిమాల మీద అథారటీస్ వాళ్ళు. తెలుగు, ఇంగ్లీష్, హిందీ అన్ని సినిమాలను భాషాభేదం లేకుండా చూస్తారు, సినిమాలోని ప్రతీ అంశాన్ని తరచి తరచి చూసి తిరిగొచ్చి రోజుల తరబడి చర్చిస్తారు. వాళ్ళ సాయంత్రం రోజుల్లో జరిపే ఆ చర్చలు, మాకు కావాలనుకున్నపుడు మంచి కాలక్షేపం. రాధకు అమితాబ్ కృష్ణ ఫేవరెట్స్, విమలకు శోభన్, ధర్మేంద

### పెరుగుతూ...!

పెరిగే చంద్ర కళలలాగ
విజ్ఞానం రోజూ
పెరుగుతూవుంటే —
పెరిగే చంద్రుని నీడలాగ
వేను అజ్ఞానిని...
నాకు తెలియనిది చాలావుంది...
అనే భావం కూడా రోజూ
పెరుగుతూ వుంటుంది!

— ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

ఫేవరెట్స్. మా రూమ్‌కి వెళ్ళిన తర్వాత మేరీ మా రూమ్‌మేటు లిటరేచర్ స్టూడెంటు వరళతో సాహితీ చర్చ సాగించింది. నాకు ఆ సాహిత్యంతో పరిచయం తక్కువ. విశ్వనాథ "వేయిపడగల" పారాయణ చేయడంలో నేను లీనమైపోయాను. మెస్ బెల్ మ్రోగిన తర్వాత మెస్‌కు వెళ్ళి భోంచేశాం.

హాస్టల్సులో చేరిన దగ్గర నుంచి రుచిలేని చప్పిడి భోజనానికి అలవాటు పడ్డాను. కాంటీన్‌లో చేసే ఫలహారాలు, ఆయా తెచ్చే మిరపకాయ బజ్జీలే ఆధారాలు మా జిహ్వలు ఆర్డరులో ఉండడానికి మేరీ భోజనందగ్గర మౌనం వహించింది

"పదవే అలా బీచి వరకూ వెళ్దాం!" అంది మేరీ మూడ్ కనిపెట్టిన రాధ బీచ్‌లో ఫిలాసఫీ స్టూడెంటు సంభాషణా చమత్కారం మేరీని కదిలించలేదు. దూరంగా డాల్ఫిన్స్ నోస్ దగ్గర దీపాలను చూస్తూ కూర్చుంది. సముద్రం ఎప్పుడూ తానే చైతన్య వంతంగా తన ఆర్కెస్ట్రాను ప్లేచేస్తూనే ఉంది. ఒకక్షణం లల్లబీ ట్యూన్ మరో క్షణం ప్రబోధగీత ఉరవడి ట్యూన్ అలారకరకాలైన ట్యూన్స్ సముద్రం వినిపిస్తూనే ఉంటుంది. వాటిని ఇంటర్‌ప్రెట్ చేసే చెవులుంటూ బీచ్ గోయర్స్‌కు ఉంటే... మేరీ గురించిన ఆలోచనల్లో నేను పడడంతో రాధ మాట్లాడ్డం వన్‌వే ట్రాఫిక్‌గా సాగుతూంది. అంతవరకు పెదవి మెదపని మేరీ హటాత్తుగా అంది, "విజయా! అటుచూడు! దూరంగా! చిమ్మచీకటిలో నేల నింగి కలసినట్టు కనబడే చోటు! అవి కలియవని కలిసేవి కావని మనకు తెలుసు, కాని కలసినట్టు కనిపించడాన్ని మరీ మరీ చూసి మురిసిపోతాం. జీవితంలో కూడా..."

మేరీ మూడ్ బాడ్ నుంచి వర్స్‌కు మారింది. దాని కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నట్టు అనిపించి రూమ్‌కు తిరిగిపోవడమే నయమనుకొన్నాను. ఇంకా ఆలస్యం చేస్తే మునిసిపాలిటీవాళ్ళు వీధి దీపాలను ఆర్పేస్తారన్న భయం కూడా లోపల నుండి రూమ్‌కి పొమ్మనమనే చెప్తోంది. తిరిగి వస్తున్నప్పుడు మేము చూసిన దృశ్యాలు ఆధునికత కాదు, సంప్రదాయాన్ని వాటిలో మంచిని పరిహసించడం, ఈ దేశానికి కావల్సింది మనుష్యుల్ని ప్రగతిపథంలో నడిపించే పరమాత్మ ఉనికిని ఊరికే శంకించడమే పనిగా పెట్టుకొని హేతువాదం, మంచిని మరచిపోయేట్టు చేయని కార్యదీక్ష ఆత్మవిశ్వాసం, అవసరమైనప్పుడు ఆశయాలకోసం అన్నిటినీ వదులుకోగల చిత్తశుద్ధి, త్యాగశీలత అలవాటుకు బానిసలయి, జీవితపు తొలి సంధ్యలోనే వెలుగుని పెంచుకుంటూ పోయే బదులు శక్తిని పుంజుకుంటూ ముందుకుపోయేబదులు నిర్లక్ష్యంగా పైలాపచ్చీసుగా చెడు అలవాటుకు బానిసలయి తిరిగే యువత చీకటును సొంతం జేసుకుంటూ పోయే యువత దేశ ఉజ్వల భవిష్యత్తుకు పునాది కాలేదు, భవిష్యత్తుకు గొడ్డలి పెట్టే అవుతుంది. యువతనలా చేసే హక్కు, ఏమీ చేతకానట్టు, చూసిచూడనట్టు వదిలివేసే నిర్లిప్తత పెద్దలైన వారికి తగదు.

పొద్దున్న ఆరు గంటలకే నన్ను నిద్రలేపి డ్యూటీ అంటూ వెళ్ళిపోయింది మేరీ. దాని మౌనం, డిప్రెస్‌డ్ మూడ్ గురించే ఆలోచిస్తూ, ఆనంద్ రూపం మనసులో మెదలుతూ ఉంటే స్నానం ముగించిందనిపించి తయారయి కాలేజీకి వెళ్ళిపోయాను. క్లాసులో ఉండగా ప్యూనొచ్చి ఎవరో ఫోను చేస్తున్నారంటే ఆఫీస్ రూమ్‌కి వెళ్ళాను. మేరీగొంతు అట్నుంచి. మేరీ మెల్లగా మాట్లాడుతూంది. వినిపించక గట్టిగా చెప్పమని దమాయించాను, మా ఆఫీసులో లేడీ టైపిస్టు నా గొంతుక ధాటికి బెదిరిపోయినట్టుంది, కళ్ళప్పగించి నా వైపే చూస్తోంది. మరి మేరీ గొంతులా నా గొంతు సన్నమూ మృదువుమూ కాదు. దాని మాటల సారాంశం నన్నోసారి హాస్పిటలుకొచ్చి దాన్ని వార్డులో కలియమని. ప్రాముఖ్యం కాకుండా మనసుకు నచ్చింది. ప్రిన్సిపాల్‌కి చెప్పి లీవ్ పెట్టేసి బస్సెక్కి హాస్పిటల్ కెళ్ళాను.

"ఏమే మేరీ! అంత దిగులుగా కూర్చున్నావు" అన్నాను, సంజ్ఞలే తప్ప మాటనోట పెకలని మేరీతో చెయ్యి విరిగిన కర్ర కుర్చీ లాక్కుని కూర్చున్నాను. అక్కడ వాతావరణం పరిసరాలు అది ఆస్పత్రిలో భాగమని ఏనాడూ హాస్పిటలుకు వెళ్ళే దురదృష్టం కలగనివాళ్ళకు కూడా తెలుస్తుంది. రోగాలను కుదర్చడంలో ఇచ్చే మందులు, చూపించే శ్రద్ధ ఎంత ముఖ్యాలో పరిసరాలు వాతావరణంకూడా అంతగానూ ముఖ్యమే అని డాక్టర్లు చేసే ఘోష అరణ్య రోదనే! స్టాఫ్ రూమ్సే ఇలా ఉంటే ఇంక వార్డ్సు ఎలా ఉంటాయో ఊహించి తెలుసుకోవచ్చు, చూడాల్సిన అవసరం లేదు. మరి పేదరికం అన్ని వంకలను దాచడానికి పనికొస్తుంది పేదదేశాల్లో.

"ఏమీలేదే! నిన్న నా దిగులుకు. కొన్నాళ్ళనుండి నన్ను వదలకుండా బాధిస్తున్న దిగులుకు కారణం నీకైనా చెప్పి కొంత రిలీఫ్ పొందుదామని పిలిచాను."

దాని కళ్ళలో తడి, ముఖంలో దీనత్వం, నాకు ఈ మధ్యకాలంలో కన్నులు తడయినట్టు గుర్తులేదు. నాకు అంత దుఃఖంగా

ఆ డాక్టరు మా అబ్బాయే, కాని వాడిమాటంటే
నమ్మకం లేదు మా వారికి చిన్నప్పట్నించీ...



## జీవనపట్టు కానికటు

ఏడుపురాదు. ఆడదానికి చటుక్కున కన్నీరొస్తుందన్న మగాళ్ల సాధారణీకరణ నా విషయంలో వర్తించదు విషాదానికి విరుగుడు హాస్యం.

"ఏవిటీ నీ మొహం! అనుకోకుండా ఎల్ బి డబ్ల్యు అయి అవుటయిపోయిన క్రికెట్ ప్లేయర్ మొహంలా! పేషంట్స్‌కు ధైర్యం చెప్పాల్సిన వైద్య వృత్తి చేపట్టబోతూ ఆస్పత్రిలోనే దిగులుతో మొహం వ్రేలాడేసే నువ్వు, మంచి డాక్టర్‌వి ఎలా అవగలవ్!" అన్నాను నవ్వుతూ, దాని మూడ్‌లో భారమైన వాతావరణాన్ని భరించలేక

"ప్లేలో ఓడడం బాధ కలిగించేది కాదే విజయా! ప్లే మొదలవకుండానే డిస్‌క్వాలిఫై అయ్యే ప్లేయర్‌ను చూస్తేనే అపరిమితమైన బాధ కలిగేది. మెడికల్ కాలేజీలో నేను గడిపిన కొన్ని సంవత్సరాలూ నాకు నేర్పిన పాఠం ఒకటుందే! డాక్టర్లను మించిన నటులుండరు. నటులు డబ్బుకోసం, పేరుకోసం లేదా కేవలం ఉత్సాహంకోసం నటిస్తారు. రోగులకు ఆత్మస్థైర్యం, నమ్మకం కలిగించడానికి లేదా భయపెంచడానికి ఇలా అవసరాన్ని బట్టి నటిస్తూ ఉంటారు డాక్టర్లు. ఆ నటన నిత్యం ఉండేది, ఇట్ ఈజ్ ఏన్ ఇంటెగ్రల్ పార్ట్, ఆఫ్ ది మెడికల్ ప్రొఫెషన్. ఆ నటించగలిగే శక్తి అయినవాళ్ళు ఆప్తులు, పేషంట్లు అయినప్పుడు సన్నగిల్లిపోతుందే. డాక్టరు మగ ఐనా ఆడైనా నటించే అసమర్థతను కోల్పోవడం జరుగుతుంది"

వినాయక్ నన్ను మొదటి సారిగా రైల్వే ప్లాట్‌ఫామ్ మీద చూశాడు. చూసినప్పటి నుంచి నాలో ఏం చూశాడో! స్నేహం చేసేడు. అది వన్‌వే ట్రాఫిక్ మన పరిభాషలో. అతను చొరవగా స్నేహం చేయబోతే అభ్యంతర పెట్టలేకపోయాను ఎంతో అభిమానంతో ఆప్యాయంగా మాట్లాడేవాడు. వారానికొకసారైన కలిసి మాట్లాడందే ఉండలేక పోయేవాడు. అలా కలుస్తూనే ఉన్నాం, సినిమా కని షికార్లు కని తిరుగుతూనే ఉన్నాం. మొదటిరోనే కాదని చెప్పకుండా ఇన్‌స్టింక్టివ్‌గా స్నేహాన్ని నటించడం నేను చేసిన తప్పు. నాకు వివాహం అయ్యుండుంటే ప్రస్తుతం నేను పడుతున్న బాధను తప్పించుకునేదాన్ని. కాని మా మేనత్త కొడుకు ఫ్రిబాడ్ వెళ్ళి నన్ను ప్రస్తుతానికి ఒంటరిగా వదిలేశాడు. బహుశా నెక్స్ట్ ఇయర్ నాకు, బావకు పెళ్ళవుతుంది.

(ముగింపు పైవారం)




## 12-2-1982 శుక్రవారం మొదలు 18-2-1982 గురువారం వరకు

మేషం : సులభ సుందరంగా, లాభదాయకంగా అప్రయత్న ధనలబ్ధిత, అప్పులైనా రాదగియుంటే వసూలు కావటం, వివిధ విషయాలు తెలిసికోవటంతో, వ్యాపార వ్యవహారాలలో సుకరం ఏర్పడటం గమనించగలరు. స్త్రీలకు : శుభ ప్రయోజనములకు అవకాశం, వృత్తిలో ఉన్నతస్థితి, క్రీడవనిలో కీర్తి ప్రతిష్ఠలకు అవకాశం గల వారం.

వృషభం : పనులకు అంతరాయాలుండవు. క్రయ విక్రయాలకు ఇబ్బందులేర్పడవు. వృత్తి ఏదో రకంగా భాసింపనున్నది. చాలమంది వినోద వస్తు సేకరణకు, వాహనం కొనుగోలు చేయుటకు అవకాశం లేకపోలేదు. స్త్రీలకు : ఒకటి రెండు వ్యవహారాలలో మేలేగాక, ఆదాయం కూడ కనిపించనున్నది.

మిథునం : ఆరోగ్య లోపం లేక పోవటంవల్ల ఉత్సాహంగా అన్ని రంగాలలో ప్రయత్నాలకు దిగవలసిన వారం. ఉపకార ప్రకృతి గలవారు, మీరు కోరకుండగనే సహకరించనున్నారు. గ్రహించండి. భూమి స్వాధీనం చేసికోవటానికి కొందరు ప్రయత్నాలు చేయగలరు. స్త్రీలకు : సర్వ విధాలా లాభదాయకమైన వారం. ప్రయత్నలోపం చేయకండి.

కర్కాటకం : కళా సాహిత్య రంగాలలో నూతన వికాసం కనిపిస్తుంది. ఉద్యోగంలో 'ప్రమోషన్'కు అవకాశముంటుంది. చాలమందికి సినీరంగావకాశాలు ఏర్పడే అవకాశం, ధనలబ్ధికి అవకాశమున్నది.— స్త్రీలకు : ఆదాయం, సుఖశాంతులు, క్రయ విక్రయాలలో లోపం లేకుండుట అనుభవానికి రాగలవారం.

సింహం : ఆరోగ్యలోపంలేదు. నూతన విషయాలలో గౌరవ, ఒక సమయంలో, ధనలబ్ధికి అవకాశమున్నది. నిత్యకృత్యంగా జరిగే వ్యవహారాలలో ఎలాంటి లోపం జరుగుటకు వీలులేదు. ఉద్యోగంలో విశేషమేదో మేలు జరుగనున్నది. — స్త్రీలకు : తాహతు గలవారికి, ప్రయత్నిస్తే, ఉద్యోగాలు కొందరకు లభించవచ్చు.

కన్య : ప్రయత్నించాలిగాని అన్ని విషయాల్లో మీకు అనుకూలతగలదు. చాలమందికి ఆరోగ్య భంగం కలుగవచ్చునని గ్రహించి మెలగాలి. ఇరుగు పొరుగుతో, సాటిఉద్యోగులతో స్నేహ భావంతో ఉండటం ఎంతైన అవసరం. స్త్రీలకు : సుఖ శాంతులు, ఆదాయంలో ఏదో విధంగా అభివృద్ధి, విందు భోజనలలో పాల్గొనుటకు అవకాశాలుండగలవు.

తుల :— సుఖశాంతులకు, నూతన దాయానికి, వ్యాపారానుకూలతకు, క్రయ విక్రయాలలో లాభదాయకమైన దినాలుగా భావించాలి. భూమిగాని, ఇంటి స్థలంగాని చాలమంది కొనుగోలు చేయుటకు అవకాశంగలదు. స్త్రీలకు : కళాసాహిత్య రంగాలలో నూతనవకాశాలుండగలవు.

వృశ్చికం : లాభ సంపాదనా మార్గాలకు అవకాశాలుంటాయి. వ్యాపారంలో నూతన ప్రయత్నాలు కొందరు చేయనున్నారు. లాభదాయకం కానున్నది. దూర బంధువులు హటాత్తుగా ఇంటికి రానున్నారు. వారి పనులకు సహాయపడటం, ఆర్థికంగా మేలు జరగటం గమనింపదగిన అంశాలు. స్త్రీలకు: ఆదాయం, వృత్తిలో వృద్ధి, వ్యాపారం ఉంటే లాభం, ఉద్యోగంలో నూతనావకాశాలుంటాయి.

ధనుస్సు : ఆల వ్యవహారాల్లో మీరు అనుకూలత సంపాదించనున్నారు. భూసంబంధమైన ఆదాయం, ఉద్యోగంలో కొందరకు 'ప్రమోషన్' లభ్యం కావటం గమనింపదగిన అవకాశాలు. పాత స్నేహితులు హటాత్తుగా ఇంటికి రాగలరు. స్త్రీలకు: రాదగిన ధనం సమయానికి అందటం, అవసరాలు తీరటం గమనింపదగిన అంశాలు.

మకరం : సుఖ శాంతులకు, ధనాదాయానికి నూతన విధానంలో ధన సంపాదనా మార్గాలుండటం, దైవ కార్యాలు నెరవేరే అవకాశం ఉండటం గమనింపదగిన అంశాలు. చాల మందికి రాజకీయంగా బాగుండటం, క్రీడవనిలో తగిన అవకాశాలు లభించటం, రచనా విధానం ఫలించటం గమనించాలి. స్త్రీలకు : సాహిత్య రంగంలో మీకు అవకాశాలు, ఆదాయం చెప్పదగిన అంశాలు.

కుంభం : మీ ప్రయత్నాలు సులభంగా నెరవేరనున్నాయి. ఇచ్చిన ధనం— సమయానికి అందగలదనే నమ్మిక కుదరటం విశేషం. బంధు విరోధం సంభవమేమో, గమనించాలి. చిత్ర నిర్మాణ కార్యక్రమం ఈ రాశివారికి సుకరంగా జరిగే వారం. స్త్రీలకు : రచనలో, పత్రికా ప్రకటన ఉంటే, అందులో హటాత్తుగా ధన సంపాదనలో లాభదాయక వారం.

మీనం : మీరు వ్యాపారం చేసే వారైతే అనుకూలత సంభవం. మీరు చిత్ర నిర్మాణ కార్యక్రమంలో నిమగ్నులయితే లాభదాయక, అనుకూలదాయక దినాలే. మీకు సాహిత్య ప్రక్రియలో భారీ వ్యాపారంలో అనుభవం ఉంటే, లాభించే మార్గమున్నది. స్త్రీలకు : అన్నిరంగాల్లో అవకాశాలు. క్రీడవనిలో సదవకాశాలు లభించుట నిశ్చయం. ఆరోగ్యలోపంలేదు.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి



# నాకీ పెళ్ళొద్దు

ఎ.వి. శేషారత్నం




**'మాంగల్యం తంతునానేనా...'**

'బాజా భజంత్రీలూ! వాయించండి గట్టిగా'— పురోహితుడు గొంతు చించుకుని అరుస్తున్నాడు.

సీతమ్మ పెళ్ళికూతురాయెనే-ఉత్సాహంగా అందుకున్నారు భజంత్రీల వాళ్ళు.

పెళ్ళి పందిట్లో ఎక్కడ చూసినా ఉత్సాహం వెల్లివిరుస్తోంది. పచ్చని కొబ్బరాకుల వాసన, కర్పూరం, సెంటు, పసుపు— అన్నీ పరిమళాలు కలిసి కొత్తరకం గుబాళింపు వ్యాపించింది పందిరి అంతటా.

ఒకపక్క బావా మరదలు, వదిన ఆడపడుచులు, అక్కా చెల్లెళ్ళ హాస్యపు జల్లులు.

అందరి దృష్టి వధూవరులమీదే వుంది. వరుడు వుండుండి కొంటె చూపులు విసురుతున్నాడు వధువుకేసి చూసీ చూడనట్లు— స్నేహితుల చెణుకులు భరిస్తూనే.

మాంగల్యధారణ అవుతుంటే వధువు ముఖంలో దోబూచులాడిన భావం అనిర్వచనీయం. ఆనందం. తత్తరపాటు, గగుర్పొడుపు, సిగ్గు— అన్నీ కలగలిసి వింత శోభవిస్తున్నాయి.

ప్రతీ దంపతుల జంట గత మధుర స్మృతులు గుర్తుకు తెచ్చుకుంటున్నట్టు పరస్పరం చూసుకున్నారు నర్మ గర్భితంగా.

ఇంత మంది చూస్తున్నా దిష్టి తగలకుండా నేనున్నానుగా' అంటూ పోటీపడుతూ కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది పెళ్ళికూతురి బుగ్గమీది నల్లచుక్క. చెవులకి చెంపస్వరాలు, పాపిట పిందెలు, కళ్యాణ తిలకం, ఎర్రని జరీ పట్టుచీర, చేతుల నిండుగా గాజులు, పాదాలకు పారాణి— పెళ్ళికూతురు కాస్త నలుపైనా ప్రత్యేకమైన అలంకరణతో కళకళ్ళాడుతోంది.

కన్యాధార పోయగానే వధువు తలిదండ్రుల పాత్ర ముగిసినట్టు పీటలమీంచి తప్పుకున్నారు వాళ్ళు ఎంతో తృప్తితో. పెళ్ళి వేడుకలు మొదలయ్యాయి.

తలంబ్రాలు, బంతులాట, బిందెలో ఉంగరం తీయడం— వయసు మరచి ఆడుకుంటున్నారు వధూవరులు.

బిందెలో ఉంగరం తీసేటప్పుడు ముందు వధువుకి దొరికినట్టుంది. గర్వంగా తలెత్తి చూపింది వధువు. కాని వెంటనే భావం మారిపోయింది -బాధ, నవ్వు, కోపం పోటీపడ్డాయి వధువు చేతిని గిల్లేసి ఉంగరం సాధించాడు వరుడు— 'ఇప్పుడేమంటావ్' అన్నట్టు చూస్తుంటే చుట్టూ పకపకలు.

అంతా చూస్తూ నిట్టూర్చింది పృథివి. తనకి పెళ్ళిళ్ళంటే విపరీతమైన సరదా. జీవితంలో ఎవరికైనా ఒకేసారి జరిగే వేడుక.

బొమ్మల పెళ్ళిళ్ళు పోటీపడి చేసేది చిన్నప్పుడు. అప్పగింతలలో కళ్ళనీళ్ళతో సహా అద్భుతంగా అభినయించేది.

తల్లి చేత చివాట్లు తింటున్నా మూడు రోజుల కొకసారైనా బొమ్మల పెళ్ళి చేయాల్సిందే ఎవరూ చూడకుండా ఇంట్లోంచి కందిపప్పు, అటుకులు బెల్లం, ఎత్తుకొచ్చేది.

బంధువులెవరింట్లో పెళ్ళయినా వెళ్ళే వరకూ నాన్నగారి దుంపతెంచేది. పృథివి పోరు పడలేక ఇంట్లో పిల్లలందరినీ వది లేసినా దూరపు పెళ్ళిళ్ళకు పృథివిని మాత్రం వెంటబెట్టుకెళ్ళేవారు రాజారావుగారు.

'ముందు దీని పెళ్ళి చేసెయ్యండి నాన్నగారూ! ఆ పెళ్ళిళ్ళ పిచ్చి తగ్గుతుంది'— అనేవాడు కేశవ్ అన్నయ్య.

ఎన్ని పెళ్ళిళ్ళు చూసినా మళ్ళీ కొత్తే. పెళ్ళిలో జరిగే ప్రతి తంతునీ ఆసక్తిగా గమనించేది. మాంగల్యధారణ వరకూ చూసిన పెద్దలు తప్పుకున్నా ఆ తర్వాత జరిగే వేడుక లన్నింటికీ ప్రత్యక్ష సాక్షిగా కాళ్ళు పీక్కు పోతున్నా అలాగే వింటునేది.

'పృథివీ! పెళ్ళయిపోయింది ఇంకా ఏంటి చూస్తున్నావ్. పోదాం పద. అమ్మ ఎదురు చూస్తుంటుంది'— భర్త సాగర్ మాటలకి గాఢంగా నిట్టూర్చింది పృథివి.

ఎప్పుడూ ఇంతే. తన పెళ్ళయాక ఇంత దగ్గరగా మళ్ళీ ఏ పెళ్ళి చూడలేదు. సాగర్‌తో కేవలం రిసెప్షన్‌కి వెళ్ళడమే.

తన పెళ్ళి గుర్తొచ్చింది పృథివికి. అందులో గుర్తించుకోదగిన మధుర దృశ్య మేదీ మనో ఫలకం మీద ముద్రపడిపోలేదు. కేవలం మరబొమ్మలా నిర్లిప్తంగా ఉండి పోయింది తన పెళ్ళికి.

అసలది పెళ్ళిలా ఉంటేగా. అక్కయ్యల పెళ్ళిళ్ళలోని వెయ్యోవంతు ఉత్సాహంలేదు తన పెళ్ళికి.

సాగర్‌తో తన జీవితం అంతా కలలోలా ముడిపడింది. ఎన్ని తర్జన భర్జనలు! అమ్మ ఏడుపులు, మొత్తుకోళ్ళు, అక్కా బావల నిరసన — తాతయ్య శాపనార్థాలు. అయినా చిన్నన్నయ్య పట్టుదల వల్లే తన పెళ్ళి జరిగింది. పెద్దన్నయ్య మొదట్లో పేచీ పెట్టినా, ఎదురుగా కనిపిస్తున్న లాభానికి, చిన్నన్నయ్య సర్దుబాట్లకి లొంగిపోయినట్టే కనిపించాడు.

'మన ఇంటా వంటా లేదురా ఇలాంటి పెళ్ళి. పెద్దవాళ్ళిద్దరికీ అంత ఘనంగా చేసి దీని ఖర్మం కాలిందిరా? ఇంతకంటే మంచి సంబంధం దొరక్కపోతుందా — అమ్మ తారెత్తున లేచింది పెద్దన్నయ్య తెచ్చిన కబురు వినగానే.

'గుంటూరులో మంచి సంబంధం వుందని' పెళ్ళిళ్ళ పేరయ్య చెప్పగానే రెక్కలు కట్టుకుని వెళ్ళారు గోపాలం, కేశవ్.

అది మధ్యతరగతి వాళ్ళ తొందర, తన తర్వాత ఇంకా ఇద్దరాడపిల్లలు గుండెల మీద కుంపట్లలా ఎదిగి కూర్చున్నారు.

'పెళ్ళికొడుకు రిజిస్టర్ మేరేజి అయితే తప్ప చేసుకోడట. వాళ్ళకి కట్నం ఆశలేదు. పిల్ల నచ్చితే చాలట. ఈ వారంలోకి ఇష్టమైతే చూసుకోడానికి వస్తారట' — పెద్దన్నయ్య అన్నంలో కూర కలుపుకుంటూ అన్నాడు అమ్మతో.

## ఉత్తిష్ఠో త్తిష్ఠ!

నిద్ర విందు లాంటిది
బద్ధకం 'మందు' లాంటిది
నిద్ర తెరకి మెలకువ కత్తెర వుంది
బద్ధకం రోగానికి మరి మందు లేదు!
గ్లాసుమీద గ్లాసు నింపినా
రోజుమీద రోజు దొర్లినా
కాలం తెలియని ఇంద్రజాలం
బయట పడలేని పంకిలం
పని విత్య చైతన్య ధమని
తీరుబడి మనిషి పాలిటి చేతబడి
వాయిదా మేలు ప్రతిలేని ముషాయిదా
గుండె తలుపు దాటరాని ముషాయిదా
నిత్యం 'రేపు' మీద చూపు నిలిపితే
మనిషికి మిగిలేది 'మాపు'
వ్యసన వసనానికి 'రేపు' లేదు
నిర్విరామ కృషికి శ్రమ తెలీదు!

— 'పైడిపాల'

చిన్నన్నయ్య చాల మెచ్చుకున్నాడు—'అసలు వ్యక్తిత్వమున్న మనిషి అంటే అలా వుండాలి. కట్నం గిట్నం లేకుండా ఈకాలం అలాంటి ఆదర్శమున్న వాళ్ళెక్కడ దొరుకుతారు?' — తను కట్నం తీసుకున్న విషయం మర్చిపోయి ఉత్సాహంగా అన్నాడు.

అమ్మ మాత్రం— 'మనకీ ముదనష్టపు సంబంధం వద్దురా కేశవా! కట్నం వద్దని పైగా రిజిష్టర్ మేరేజి అంటున్నాడంటే ఇందులో తప్పకుండా ఏదో లొసుగుండి వుంటుంది'— అంటూ పేచీ పెట్టింది

తాతయ్య నరసింహావతారం దాల్చాడు 'సంతకం పెళ్ళి'కి తమ నసేమిరా ఒప్పుకోనని.

చిన్నన్నయ్య తనకేసి చూసాడు. భావ గర్భితంగా. తనేం మాట్లాడుతుంది? నిజం చెప్పాలంటే తన కసలు అప్పుడే పెళ్ళి చేసుకోవాలనిలేదు. నీలూలా కొన్నాళ్ళు ఉద్యోగం చేసుకుంటూ స్వేచ్ఛగా హాయిగా బ్రతకాల మంది. అందులోనూ రిజిస్టర్ మేరేజ్ అంటే అసలు... ఒకవేళ అమ్మ అనుమానం నిజ మయితే— జీవితాంతం ఏడవాలి.

ఛ! మరీ అమ్మమ్మలా ఆలోచిస్తోందే తను. కాలేజి డిబేట్లలో ఆదర్శ వివాహాలు, వరకట్న నిషేధాలమీద ఉపన్యాసాలు దంచి బహుమతులు అందుకున్న తను...

కానీ అది స్టూడెంట్ లయిఫ్. ఏ చీకూ చింతా బాదరబందీ లేని వయసు. ఉత్సాహం ఉరకలు వేస్తూ, అన్యాయాలకి ఉడుకెత్తే రక్తం.

'నిరాడంబరమైన పెళ్ళిళ్ళు'— తన వ్యాసానికి ఫస్ట్ ప్రయిజ్ వచ్చినపుడు ప్రిన్సిపల్ 'పృథివి చెప్పిన సూచనలు యువతీ యువకులు ఆదర్శంగా తీసుకుంటే పెళ్ళిళ్ళల్లో కన్నీళ్ళు వృథా ఖర్చులు ఉండవు'— అంటూ ఆకాశాని కెత్తేసారు. విద్యార్థినులే కాక విద్యార్థులు కూడా మారుమ్రోగేలా చప్పట్లుకొడుతుంటే గర్వంగా స్టేజిమీద బహుమతి అందుకుంది. కాని...

'అదేం మాట్లాడుతుందిరా! మీ నాన్నే బ్రతికుంటే'...కళ్ళనీళ్ళు పెట్టుకుంది అమ్మ.

'అబ్బబ్బ! ఇప్పుడేదు పెందుకమ్మా! ఇంకా పెళ్ళికొడుకు వచ్చి చూసుకోవాలి, అతనికి వాళ్ళ అమ్మానాన్నలకు ఇది నచ్చాలి కదా!'— కేశవ్

'ఏమే పృథివీ! స్టేజిమీద ఉపన్యాసాల వరకేనన్నమాట మన ప్రతాపం. 'తనకీ పెళ్ళొద్దు' అంటున్న పృథివిని ఉడికించాడు గోపాలం.

కేశవ్ ఉత్తరాన్ని చూసుకుని పెళ్ళికొడుకు సాగర్, అతని తల్లిదండ్రీ వచ్చారు చూసుకు వెందుకు.

పెళ్ళిచూపులు కూడ అధునాతనంగానే జరిగాయి. చాపమీద తలవంచుకుని కూర్చో వాలనుకున్న తనకి సింపుల్‌గా ఓ వాయిల్

చీర కట్టించి అతని ఎదుటి కుర్చీలో కూర్చో బెట్టారు. ఇదీ అతని కోరికేనని తర్వాత తెలిసింది.

వింతో అయిష్టంగా కూర్చున్న తను అసలు పెళ్ళికొడుకుని తలెత్తి చూడదలచుకో లేదు.

కానీ వాళ్ళంతా ఇంట్లో బంధువుల్లా కలిసిపోయి మాట్లాడ్డం, టిఫిన్ చొరవగా అందుకోవడం అవీ చూసి మెచ్చుకోకుండా ఉండలేకపోయింది. తన ఫ్రెండ్ మాధవిలా తనని సంతలో పశువులా చూడనందుకు మనసులోనే ధన్యవాదాలర్పించుకుంది.

'మీ యింటిముందు చక్కగా తోట పెంచారే, మన మక్కడ కూర్చుని కాఫీ తాగుదామా మిస్...'





# నాకీ పెళ్ళొద్దు

'పృథివి'

సాగర్ భావాన్ని అర్థంచేసుకున్న గోపాలం అన్నయ్య హడావుడిగా రెండు కుర్చీలు వేయించాడు గార్డెన్‌లో సాగర్ వద్దంటున్నా వినక.

సాగర్ లేచి నుంచోవడం చూసి అయిష్టంగానే అనుసరించింది తను. పూర్వకాలపు అమ్మ కళ్ళల్లో 'కలికాలం' అన్న ఆశ్చర్యం!

సాగర్ మాటల్లో అంత చతురుడనుకోలేదు. ఫ్రెండ్స్‌తో మాట్లాడుతున్నట్టే మాట్లాడి తన మొహభావాన్ని ఎగరగొట్టాడు. తమ్ముళ్ళూ, చెల్లాయిలూ దొంగతనంగా తోటలోకి తొంగి చూస్తుంటే కసిరాడు గోపాలం.

'చూడండి పృథివి! మనం నిర్మొహమాటంగా మాట్లాడుకుందాం— మీరూ చదువుకున్నవారే కనుక మీరు నాకు నచ్చారు. కానీ నా షరతులు మీ అన్నయ్య చెప్పే వుంటారు. అవి షరతులనేకంటే నా ఆదర్శం — నా బంగారుకల అంటే బాగుంటుందేమో! నాకు పూర్వకాలపు పెళ్ళి తంతంటే విరక్తి. అనవసరపు శ్రమ, వృధా ఖర్చనిపిస్తుంది. మీకీ విషయంలో అభ్యంతరం లేకపోతే మన వివాహం ఖాయమైనట్టే. లేదా స్నేహితుల్లా విడిపోదాం.'

అతను మాట్లాడిన దానిలో పొల్లుమాట గానీ, అసభ్యతగానీ ఏమీలేదు. మాటిగా ఖచ్చితంగా తన అభిప్రాయం చెప్పాడు. ఏదో ఆదర్శంకోసం అలా చెప్తున్న గర్వంగాని అతిశయంగానీ కన్పించలేదు. రూపానికేం ఢోకాలేదు. ఆడవాళ్ళు మరోసారి వెనక్కి తిరిగి చూసే అందం.

'మరింతకాలం ఇంతటి ఆదర్శవంతుడికి పెళ్ళెందుకు కాలేదు?' కొంపదీసి అమ్మ అనుమానం ...

'నీకు మాటలు రావనుకుంటానే' నవ్వాడతను. 'ఆ అన్నట్టు మరో విషయం చెప్పడం మర్చిపోయాను, ఇంత ఆదర్శం గల నాకింకా పెళ్ళెందుకు కాలేదా అని ...' తన మనసులో భావం చదివేసినట్టే అంటుంటే తేలుకుట్టిన దొంగలా ఉలిక్కిపడింది.

"అబ్బబ్బే...మరి..."

'హమ్మయ్య! మీరు మూగవారు కాదు.' ఈసారి తనకే నవ్వొచ్చింది.

'తప్పేంలేదులెండి. పెళ్ళి సంబంధం మాట్లాడ్డానికెవరొచ్చినా నా అభిప్రాయం విని 'ఆ మరీ అంత ఖచ్చితంగా ఉంటా డేమిటిలే' అని పెళ్ళిచూపులకి పిలవడం తీరా వెళ్ళాక నాలో ఏంవంకా దొరక్క ... నాలో మరేదో లోపం ఉండబట్టే ఇలాంటి గుట్టు పెళ్ళి కావాలంటున్నానని వాళ్ళే తమ అయిష్టాన్ని తెలియజేయడం జరిగేది. నాకు విసిగెత్తిపోయింది. ఏమిటీ మనుషులు! ఘనంగా పెళ్ళిళ్ళు చెయ్యడానికి స్థోమత లేకపోయి నా అప్పుచేసె నా కట్నంతో ఘనంగా పెళ్ళి చేస్తారేతప్ప ... అందుకే అసలు ఈ వరకట్నాలకి కారణంగా అన్యాయంగా మగ వాళ్ళని దుమ్మెత్తి పోస్తారుగాని అసలు ఆడవాళ్ళే కారణం. ఓ సారీ! అసలు నాకీ పెళ్ళిచూపులంటే కూడ ఇష్టంలేదు. కాని చేసుకోబోయే పిల్లను కనీసం చూడనైనా చూడకుండా ఎలా చేసుకోవడం అనీ, మరో మార్గాంతరం లేకా ఇలా...'

నిజంగా ముచ్చటేసింది తనకి.

'కొంపదీసి నన్ను వాగుడుకాయ అనుకోవడం లేదుగదా! నేనసలు మితభాషినే కాని మిమ్మల్ని చూసాక... సారీ నేనిలా మాట్లాడకూడదు'

'ఏం పృథివీ! సాగర్‌గారికి తోటంతా చూపించేసావా! ఇదంతా మా పృథివి గొప్ప తనమేనండీ ఈ పువ్వులిలా అందంగా విరబూయడం'– కోపంగా చూసింది తను చిన్నన్నయ్యకేసి.

లేకపోతే పరాయివాళ్ళముందా వేళాకోళమేమిటి? ఎంత బతిమాలినా బిందెడు నీళ్ళయినా మొక్కలకి పోయదని వెక్కిరింపు. తనకసలు తోటపనంటే బద్ధకం. ఆ తోట అంత అందంగా వుందీ అంటే చిన్నన్నయ్య చలవే.

'అబ్బా అలా కోపంగా చూడకే తల్లీ! నీ చూపులకి భస్మమైపోయామంటే నీకి కాఫీ ప్రాప్తి ఉండదు'– సాగర్‌కి కప్పు అందించాడు.

చటుక్కున అతనికేసి చూసింది. సాగర్ అపురూపంగా చూస్తున్నాడు ఇద్దరినీ.

పెళ్ళివారు వెళ్ళాక ఇంట్లో రామ రావణ యుద్ధమే జరిగింది గోపాలం పూర్తిగా సాగర్ పక్షపాతి అయిపోయాడు.

'అతనికేం తక్కువ. మంచి పర్సనాలిటీ. చదువు సంస్కారం. నిక్షేపంలాంటి ఉద్యోగం; నాకేం లోపం కనిపించడం లేదు. పైగా ఈ కాలంలో కట్నం లేకుండా ఎవరొస్తారు?

అదీగాక పృథివి తరువాత ఇంకా ఇద్దరాడపిల్లల పెళ్ళిళ్ళు చేయాలి, మాకూ సంసారాలున్నాయి. కట్నం ఇవ్వడమే మీ ఉద్దేశమయితే అది పృథివి చేతిలో పెట్టండి, పెళ్ళి ఖర్చుకయే డబ్బుతో సహా, వాళ్ళ సంసారానికి కావలసినవి కొనుక్కుంటారు. మనకీ హైరాన తప్పుతుంది. ఇదే నా పిల్లయితే కళ్ళు మూసుకుని చేసి పారేస్తాను.'

పెద్దన్నయ్యకి కూడ ఏ వంకా దొరకలేదు. పైగా నయాపైస ఖర్చులేకుండా ఆడపిల్ల వదిలిపోతోందంటే చేదా?

తనకే ఏమీ పాలుపోవడంలేదు. ఈ పెళ్ళి చేసుకుంటే తన కలల బంగారు సౌధాన్ని చేజేతులా కూలదోసుకున్నట్టే! జీవితంలో మళ్ళీ మళ్ళీ వచ్చేదా పెళ్ళి? ఏదో ఒకసారికి సర్దుకుపోవడానికి. అయినా ఈ మనిషికిదేం పట్టుదల. ఆదర్శం కోసం కట్నం మానేయొచ్చుగాని...

అసలు పెళ్ళి కళే వేరు. పెళ్ళి ఫొటోలు చూసుకుంటే ఆ మధుర దృశ్యాలన్నీ కళ్ళకు కట్టినట్టుండాలి.

తలమీంచి బియ్యం ముత్యాల్లా రాలి పడుతూంటే ... ఓహ్ శిరీష ఫొటోలెంత బాగా వచ్చాయి. దాని ఆల్బమ్ ఎవరికైనా చూపిస్తుంటే ఇప్పటికీ దాని బుగ్గల మీద గులాబీలు దొర్లిపోతాయి. ఏన్ని ఊహించుకుందో తన పెళ్ళి గురించి.

సంతకం పెళ్ళిలో ఆ పెళ్ళి మంత్రాల పవిత్రత, విపుల, ముత్తైదువుల ఆశీర్వాదాలు ఎలా వస్తాయి. ఊహూ! తనకీ పెళ్ళి ఇష్టంలేదు.

కాని మనసు సాగర్ రూపాన్ని సంస్కారాన్ని గుర్తుతెచ్చి మొరాయించింది. చివరికి బంగారు కలని వాస్తవం జయించింది. తను సాగర్ అర్థాంగి అయింది.

సింపుల్‌గా రెండు దండలు వేసుకుని సాక్షుల ఎదురుగా రిజిస్టర్ సంతకాలు పెట్టి దంపతులయ్యారు. అప్పగింతల దృశ్యం లేకుండానే అమ్మ కళ్ళల్లో నీళ్ళు.'

అత్తయ్య మామయ్య చాలా మంచివాళ్ళు. ఆ యింట్లో తనకేం లోపంలేదు కానీ ఏదో తప్పు చేసినట్టే వుంది. జీవితం తీరని అసంతృప్తి.

అన్నయ్యలు మాత్రం కృతజ్ఞతగా ప్రేమగా చూసారు– అనవసరపు శ్రమ, ఖర్చు తప్పించావే పృధీ అంటూ.

బంధువులలో చాల గొడవే తెచ్చిపెట్టింది తన పెళ్ళి. 'పిల్ల వదిలిపోతుందనే స్వార్థంతో దారినబోయే దానయ్యకి కట్టబెట్టారనే మాటలు పడ్డారు అన్నలు. ఆ మాటల్లో రవంత అసూయ లేకపోలేదు.

అమ్మా తాతయ్యలకు మొదలే ఇష్టం లేదు. కానీ అల్లుడి నైజం విషయంలో ఏటూ తేల్చుకోలేక పోయారు. వదినలు ఏటూ మొగ్గు చూపలేదు.

'ఛీ! మీరు నా బంగారు కలని చిందర వందర చేసేసారు' — తన మాటలకి సాగర్ పడీపడీ నవ్వాడు.



# నాకీ పెళ్ళొద్దు

"పోనీ నీ సరదాకోసం మళ్ళీ పెళ్ళి చేసుకుందామా? మరో నలభై ఏళ్ళు ఆగాలి. ఇదిగో శైలూ! మీ వదినని పెళ్ళికూతురిలా అలంకరించవే పాపం! బియ్యం అవీ పట్టా. తలంబ్రాలు పోసుకుంటాం" తెగ ఆటలు పట్టించాడు.

'పిచ్చి పృధీ! ఇలా నాకేసి చూడు ఎంత తృప్తిగా ఉన్నానో, చిన్నప్పట్నుంచే నాకీ పెళ్ళిలో వృధా ఖర్చంటే ఎంత అసహ్యమున్నా అక్కయ్యల పెళ్ళికి ఆపలేకపోయాను అస్వతంత్రుడిని కనుక. నా ఆదర్శాన్ని కనీసం నా పెళ్ళి విషయంలోనైనా ఆచరణలో పెట్టకపోతే జీవితం వ్యర్థమనిపించింది. ఆడంబరం తప్పితే ఏముంది ఆ పెళ్ళిలో? దీవనలంటావా? పుట్టెడు అప్పుల బాధ మనసును తొలిచేస్తుంటే పైకి గంభీరంగా మీవాళ్ళిచ్చే దీవనలు నీకు తృప్తినిస్తాయా? ఇక పేష్టీకోసం అంటావా? ఏం గొడవలొచ్చినా ఆ పెళ్ళికొచ్చిన పెద్దలంతా సాక్ష్యమిస్తారంటావా? ఏదో మొక్కుబడిగా దక్షిణకోసం పురోహితుడు చదివే మంత్రాలు కావాలా నీకు?

నిజంగా మన పెళ్ళి ఆడంబరంగా చేస్తే ఎంత లేదన్నా మీకో పదివేలు, మాకో ఐదువేలు అయ్యేవి. ఆ డబ్బుతో మన ఇంటికి ఎంత సామాను కొనుక్కున్నామో చూడు. మీ అన్నలు మనస్ఫూర్తిగా ఇచ్చిన డబ్బది పృధీ! సాంప్రదాయం నరనరానా జీర్ణించుకుపోయిన మనుషులందరిలో ఈ మార్పు రావాలంటే చాలకాలమే పడుతుంది. మనలాంటి వాళ్ళే పునాది వెయ్యాలి నామీద కోపం వచ్చిందా?'

గేటు తీసేవరకు మ్రోగిస్తున్న హారన్‌తో స్పృహలోకొచ్చింది పృధివి. గాడ్రెజి బీరువాలోంచి డబ్బు తీసుకుని మళ్ళీ బయలుదేరుతున్న సాగర్‌ని తల్లి అడిగింది 'మళ్ళీ ఎక్కడికిరా'

"అక్కడ పెళ్ళికొడుకు అలకపాన్పు దిగనంటున్నాడమ్మా స్కూటర్ డబ్బు ఇస్తేగాని"... ఆ పెళ్ళికొడుకు నాకు బాగా పరిచయస్థుడే. ఇంటర్ కాలేజీ కాంపిటేషన్లో 'ఆడంబరపు పెళ్ళిళ్ళు' మీద ఫస్ట్ ప్రయిజు తెచ్చుకున్నవాడే — స్కూటర్ కనుమరుగౌతుంటే నిట్టూర్చింది పృధివి.




(గత సంచిక తరువాయి)

ఒక మనిషి ఉన్నప్పటికంటే ఆ మనిషి లేనప్పుడే వాళ్ళ విలువ పెద్ద బోర్డుకట్టి మరీ చూపి ట్టుగా తెలుస్తుంది !

తార వెళ్ళాక ఆమె లేని లోటు ఆ యింట్లో ప్రతివాళ్ళకూ అనుభవమవుతున్నాది ! పైగా తార ఆ యింటికి వచ్చింది మొదలు మళ్ళీ పుట్టింటికి వెళ్ళలేదు ! ఎపుడయినా మీటింగులంటూ వెంకట్ తీసుకెళ్ళటం తప్ప తార తనంత తానుగా ఎక్కడకూ వెళ్ళలేదు !

ఏమీ పట్టించుకోని వెంకట్రామయ్యగారి దగ్గర్నుండీ, ప్రతిచిన్న విషయానికీ తార అనుజ్ఞ కోసం వేచి ఉండే పాలేరు రంగడు వరకూ ఆమె రాక కోసం ఎదురుచూస్తున్నారు. వెంకటరత్నానికయితే అసలు ఇంటికి రావాలంటేనే చిరాకు వేస్తోంది !

ఆ రోజు – 1946 జనవరి 21వ తేదీ !

వెంకటరత్నం. జట్టులోని వారంతా ఆ రాత్రి తొమ్మిదిగంటల తర్వాత రైల్వే స్టేషను ప్రక్కన ఉన్న ఇసుక దిబ్బల ప్రక్కన కలుసుకోవాలని అనుకున్నారు. సాయంకాలం నాలుగుగంటలకంతా ఇంటికి వచ్చేసాడు. స్నానంచేసి బట్టలు మార్చుకున్నాడు. వంటగదిలో సత్యవతమ్మా, గిరిజా తెగ హడావుడి పడిపోతున్నారు. 'తార ఉంటే నిశ్శబ్దంగా జరిగిపోయే పనులు వీళ్ళ చేతుల్లో దండోరా వేయించుకుంటాయి !' చిరాగ్గా అనుకున్నాడు. వంటగది దగ్గరకు వెళ్ళి మంచినీళ్ళు అడిగి త్రాగాడు.

"ఏమిటమ్మా ! హడావుడి పడుతున్నావు ?" నవ్వుతూ అడిగాడు.

"ఆఁ – ఏం లేదురా, పెద్దతనం వచ్చేసిందా! ఏ కాస్త పనీ చేయలేకపోతున్నాను," ఆయాసపడుతూ చెప్పింది.

"ముగ్గురున్నారు ! వాళ్ళను చేయమనక పోయావా ?" వస్తూన్న విసుగును దాచుకుంటూ అన్నాడు.

"దమయంతి ఇంకా ఇంటికి రాలేదు. కళ్యాణి గుడివాడ వెళ్ళింది. ఈ బండికి వచ్చేస్తానని చెప్పింది."

"గుడివాడ ఎందుకు ?"

"అది అక్కడ ఏమిటో చదువుకుంటుందటరా! ఏమిటో అది – దానిపేరు మర్చిపోయాను. నీతో చెప్పాలని అంటున్నాది." వెంకటరత్నానికి చర్రున కోపం వచ్చింది. కాని, నిగ్రహించుకుని బయటకు వచ్చేసాడు. గదిలోకి వెళ్ళి, తలుపులు చేరవేసి, కిటికీ దగ్గర కూర్చుని ఆ రాత్రి మీటింగులో చెప్పదలచుకున్న విషయాలు ఒక చిన్నకాగితంమీద గుర్తుగా వ్రాసుకున్నాడు. ఆ కాగితాలూ, పెన్నూ షర్టు జేబులో పెట్టుకున్నాడు. అద్దం ముందు నిలబడి తల దువ్వుకున్నాడు. గడియారం చూస్తే నాలుగుగంటల నలభై నిమిషాలయింది.

'తార ఉంటే బాగుండేది ! ఏం చేస్తున్నాదో అక్కడ' అనుకున్నాడు.

అలమరా వద్దకు వెళ్ళి వరుసగా పేర్చి ఉన్న పుస్తకాలలోంచి ఒకటి తీసాడు. రెండు మూడు పేజీలు చదివేసరికి విసుగుపుట్టింది. "ప్చ్ ! ఈ రోజు మనసు దేనిమీదా లగ్నం కావటం లేదు." ముందరవైపు వరండాలోకి వచ్చి నిలుచున్నాడు.

చెరువులో కడిగిన గేదెలను తీసుకొచ్చి చావిడి బయట గుంజలకు కట్టేస్తున్నాడు రంగడు.

పెద్ద పాలేరు గురవడు పచ్చగడ్డిమోపు తలపై పెట్టుకుని ఎడ్లను తోలుకుంటూ వచ్చాడు. ఎన్నడూ లేనిది వరండాలో నిలబడి ఉన్న చిన్న దొరను చూడగానే కొంచెం భుజాలు వంచి, తలకు కట్టిన తుండుతీసి మొలకు కట్టుకున్నాడు. రంగడు చావిడి శుభ్రం చేస్తున్నాడు, గురవడు చేతులు కడుక్కుని, పాలబిందె తీసుకెళ్తున్నాడు.

'సుయ్యి – సుయ్యి' పాలు తీస్తూన్న శబ్దం వింటుంటే వెంకటరత్నానికి చిన్నగా నవ్వు వచ్చింది. వరండాలో ప్రక్కగా ఉన్న చెప్పులు వేసుకుని వీధి గడపలోకి వెళ్ళాడు. దూరంగా దమయంతి నడచి వస్తున్నాది.

ఎడమవైపుకు తలత్రిప్పి చూసాడు. చెరువు గట్టున రాములవారి గుడిముందు, రావిచెట్టు క్రింద నలుగురైదుగురు కూర్చుని ఉన్నారు. అతనికి తెలియకుండానే అతని కాళ్ళు ఆ వైపుకు నడిచాయి. నెమ్మదిగా, ఠీవిగా నడచి వస్తూన్న వెంకటరత్నాన్ని ఆశ్చర్యంగా చూసారు గట్టుమీద కూర్చుని చుట్టలు చుట్టుకుంటూన్న గ్రామపెద్దలు.

'మన కళ్ళముందు పుట్టి పెరిగిన వెంకట్రామయ్య కొడుకు ఎంత ఎదిగిపోయాడు !' అని ఆశ్చర్యపోతుంటారు అపుడపుడూనూ. అలాగ గ్రామపెద్దలు దృష్టిలో కూడా ఎదిగిపోయిన తర్వాత వెంకటరత్నం ఆ సమయంలో, అంత తీరిగ్గా, ఆ వీధిలో అలా నడవటం ఇదే మొదటిసారి కాకపోయినా, చాలా అరుదు !

"ఏరా ! చాన్నాళ్ళకు కన్పిస్తున్నావు !" అంజయ్యగారు అడిగారు.

అది ప్రశ్న కాదు ! పలకరింపు ! గ్రామాలలోని పలకరింపులు తమాషాగా ఉంటాయి ! కొన్ని ప్రశ్నలలాగా, కొన్ని తిట్లలాగా, మరికొన్ని మందలింపు ధోరణిలోనూ ఉంటాయి కూడాను !

వెంకటరత్నం ఎడమచేత్తో తలవెనుక క్రాపును సవరించుకుంటూ నెమ్మదిగా నవ్వాడు.

"రఘుమా బాగాచదువుతోందా మామయ్యా?" అన్నాడు.

ఆయన ప్రక్కనే ఉన్న ఆంజనేయులుగార్ని చూస్తూ నవ్వుతూ అడిగాడు – "ఏం బాబాయి ! మీ ఆరోగ్యం ఎలా ఉంది ?"

"బాగానే ఉందిరా ! కోడలి కబుర్లు తెలుస్తున్నాయా ?"

"వాడి బుర్రనిండా కమ్యూనిస్టు కబుర్లే ఉంటాయి బావా !" చమత్కరించారు బ్రహ్మయ్యగారు.

మరికొంచెంసేపు వాళ్ళతో కబుర్లు చెబుతూ అక్కడే నిలబడ్డాడు వెంకటరత్నం. అతని దృష్టి ఆ ప్రక్కనే 'గోళీలు' ఆడుతూన్న పిల్లలమీద నిల్చింది. అతని పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి. పంచెను పైకి మడుస్తూ వాళ్ళను సమీపించాడు వెంకటరత్నం.

మరో పదినిమిషాలకల్లా అతని బుర్రలో ఉండే అంతటి పెద్ద పెద్ద సమస్యలూ కూడా

**జరిగిన కథ – 9** రాఘవయ్య, నాగరత్నం దంపతులకు తార, సరళ–రామారావ్, రామ్మోహన్, చంద్రం సంతానం. కమ్యూనిస్టు పార్టీ ప్రముఖులలో ఒకడుగా పేరు తెచ్చుకుంటాడు వెంకటరత్నం. శ్రీనివాసరావ్‌తో కలసి ప్రసాద్ పెళ్ళికి వెళ్ళిన వెంకటరత్నం మదిలో 'అనుకోని సంఘటన' ద్వారా ముద్రవేసుకొంటుంది తార. ఎవరెన్ని విధాల నచ్చజెప్పినా వినక వెంకటరత్నాన్నే పెళ్ళి చేసుకొంటుంది తార. భర్తపైన ఉండే గౌరవంకొద్దీ అతను పంపే ఉత్తరాలతోపాటు పార్టీ పుస్తకాలు కూడా చదువుతూ ఆనాటి రాజకీయాలను అవగతం చేసుకొంటుంది తార. బెజవాడలో జరగబోతున్న మీటింగులకి వెళ్దాం రమ్మని తారకు ఉత్తరం ద్వారా తెల్పుతాడు వెంకటరత్నం. తండ్రి వెళ్ళొద్దని వారించినా వినక ఎన్నో బాధలకోర్చి అతన్ని కలుసుకొంది తార. రాఘవయ్య నిరాదరణతో వెంకట్ వెంట వచ్చిన తార అత్తగారింటి పరిస్థితుల్ని అవగాహన చేసుకుంటుంది. అల్లుడి ద్వారా తార గర్భవతి అని తెలుసుకొన్న రాఘవయ్యగారు పరమానందభరితులై, రెండు మూడు రోజుల్లో వచ్చి చూస్తానని చెబుతారు. పురిటికి పుట్టింటికి వెళ్తుంది తార.

తొలగిపోయి, చిన్న పిల్లవాడిలాగా వాళ్ళల్లో కలిసిపోయి గోళీ లాడుతున్నాడు వెంకటరత్నం!

వెంకటరత్నం చెరువుగట్టుకు వెళ్ళటం చూసి అక్కడికొచ్చిన అతడి మిత్ర బృందం వెంకటేశ్వరరావూ, సీతారామయ్యా, వెంగళరావూ, బ్రహ్మరావూ, ఉమామహేశ్వరరావూ - అందరూ కూడా అలా నిలబడిపోయి వాళ్ళ ఆటను గమనిస్తున్నారు.

సరిగ్గా ఆదే సమయంలో "అన్నయ్యా, అన్నయ్యా!" అంటూ పరుగెత్తుతూ వచ్చింది దమయంతి.

ఒగరుస్తూ నిలబడిన దమయంతి వంక 'ఏమిటి?' అన్నట్లుగానూ 'ఏమిటా పరుగు?' అని మందలిస్తున్నట్లుగానూ చూసాడు.

"మరే ... మరే...నీకు ఆడపిల్ల పుట్టిందిట. అమ్మ చెప్పమంది" చటుక్కున వెనక్కు తిరిగి తుర్రుమంది దమయంతి.

వెంకటరత్నం నుదుటిపై నిలచిన చెమట బిందువులు చెరువుమించీ వస్తున్న సూర్యకిరణాల వెలుతుర్లో తళుక్కున మెరుస్తున్నాయి. అతని కళ్ళల్లోకి గబుక్కున తొంగి చూసిన సంతోషపు కాంతులు అంతలోనే సిగ్గుపడి పక్కకు తప్పుకున్నాయి.

తన చుట్టూ నించున్న మిత్ర బృందమంతా ఇంచుమించు తన వయసువారే! కానీ, ఇంకా ఎవరకూ పెళ్ళిళ్ళే కాలేదు! తనకేమో పెళ్ళీ అయింది! అప్పుడే తండ్రి కూడా అయ్యాడు! అందువల్లనే కించిత్ సిగ్గు కలిగింది.

మిత్రులు తెల్పుతూన్న అభినందనలను చిరునవ్వుతో స్వీకరించుతూ, పైకి మడిచిన పంచెను క్రిందకు విడుస్తూ వాళ్ళతో కలిసి ముందుకు నడిచాడు.

* * *

తార అత్తవారింటికి వచ్చి నెలరోజులు పైనే అయింది. వచ్చిన మొదటిరోజు, రెండవరోజు మాత్రం అత్త, ఆడపడుచులు తారను చాలా అపురూపంగా చూసారు. ఆ మరురోజు నుంచీ మళ్ళీ మామూలే! ఇపుడు బాలింతాలేదు; పథ్యమూ లేదు!

అది గమనించిన తార అనుకునేది — 'ఈ మనుష్యులు మంచివాళ్ళే! వీళ్ళ మనసులు కూడా ప్రేమ పూరితాలే! కాకపోతే కాస్త సోమరితనము, బద్ధకమూ మాత్రం ఎక్కువ పాళ్ళలో ఉన్నాయి! అంతేకాకుండా వీళ్ళల్లో చాలా కాలంగా పాతుకుపోయిన కొన్ని మూఢ అభిప్రాయాల మూలంగా కోడలి పట్ల అంత నిరంకుశంగా ప్రవర్తిస్తున్నారేమో! 'కోడలు అంటే ఏదో నెల నెలా జీతం బత్తెం ఇవ్వనవసరం లేకుండా ఇంటెడు చాకిరీచేసి పెట్టే ఒక పనిమనిషి!' అనే అభిప్రాయం వాళ్ళల్లో వెనకటినుండీ వస్తూన్న ఒక ఆచారం లాగానే పాతుకుపోయింది. లేకపోతే ఒక్కోసారి ఎంతో ప్రేమగా ఉంటారు! ఒక్కోసారి శత్రువుల్లాగా కనిపిస్తారు. ఏ కారణం లేకుండానే చిత్రవధకు గురిచేసే మాటల్ని విసురుతుంటాడు. ఏమిటో — వీళ్ళ మనస్తత్వాలు!' అర్థం చేసుకోలేక సతమతమయ్యేది, తార.

ఆ యింట్లో కొన్ని క్రొత్త మార్పులు కూడా జరిగాయి!

కళ్యాణి గుడివాడలో ఉండి హిందీ చదువుకుంటానని పేచీ పెట్టింది. వెంకట్రామయ్యగారు సామాన్యంగా ఏ విషయాలూ పట్టించుకోరు. వెంకటరత్నానికి ఇలాటి విషయాలు వినే ఓపికగానీ, తీరికగానీ లేవు! సత్యవతి ఆడపిల్లల విషయంలో వాళ్ళ మాటను ఎపుడూ 'కాదు' అని అనదు. అందువల్లనే కళ్యాణి గుడివాడలో రాఘవయ్యగారింట్లో ఉండి హిందీ చదువుకుంటోంది!

తారకు 'ఆడపిల్ల పుట్టింది' అని రామారావు కబురు తెచ్చిన రెండో రోజున సత్యవతి కళ్యాణిని తీసుకుని గుడివాడకు బయలుదేరింది. 'కోడల్ని, మనుమరాల్ని చూసినట్లూ ఉంటుంది, కూతురి విషయం మాట్లాడనూవచ్చు' అని ఆవిడ అభిప్రాయం! అయినా వియ్యపురాలు, అడిగితే



ఎవరైనా కాదని అనగలరా? ఆ తర్వాత వారంలోనే కళ్యాణి గుడివాడకు వెళ్ళిపోయింది.

గిరిజ నెల తప్పింది. ఇంటిల్లిపాదీ ఎంతో ఆనందించారు. చాలాకాలం తర్వాత వెంకటరత్నం చెల్లితో పరిహాసాలు ఆడాడు. దమయంతి బావగార్ని ఆటలు పట్టిస్తుంటే, గిరిజ ఉడుక్కోవటం, చెల్లెలితో తగువు పెట్టుకోవటం చూస్తే వెంకటరత్నానికి నవ్వు ఆగలేదు. చాలాకాలానికి కుటుంబంతో కలిసి కూర్చుని మనసారా పకపకా నవ్వుతూన్న కొడుకుని నిండుగా, పరవశంగా చూసారు వెంకట్రామయ్యగారు.

ఇంక సత్యవతమ్మకు మరీ అపురూపమైపోయింది గిరిజ. నడిస్తే అలసిపోతుందేమో, వదిలేస్తే కందిపోతుందేమో అన్నంత గారంగా చూస్తున్నాది. రోజుకో రకం పిండివంట చేసి పెడుతున్నాది.

అవును మరి!

ఏ వేడుకా లేకుండా, ఇంటెడు చాకిరీ చేయటానికి గిరిజ తార కాదుగా!

గిరిజ ఆ యింటి ఆడపడుచు!

తల్లికి ముద్దుల కూతురు!

తార కూతుర్ని ఎత్తుకుని వచ్చేనాటికి గిరిజకు మూడవ నెల!

ఐదు నెలల పసిపాప ఎంతో అందంగా, ఆరోగ్యంగా, ముద్దుగా ఉన్నది. బంగారు రంగులో, గులాబీ రేకులవంటి మృదువైన శరీరం పట్టుకుంటే మాసిపోతుందేమో అన్నట్లుగా మెరుస్తుండేది!

వెంకటరత్నం చూపుడువేళ్ళు అందిస్తే ఆ రెండు వేళ్ళూ పట్టుకుని, లేచి నిలబడి వెంకటరత్నం కాళ్ళమీంచీ, పొట్టమీంచీ భుజాలమీదికి ఎక్కేసేది.

"ఇన్నాళ్ళ నా కలలకు రూపం ఇచ్చిన నా కూతురుకు 'స్వప్న' అని పేరు పెట్టుకుంటాను." అన్నాడు వెంకటరత్నం.

"చాలా బాగుంది" అన్నది తార.

నవ్వి ఊరుకున్నారు వెంకట్రామయ్యగారు.

"అన్నయ్యా! నీ కూతురి పేరు, దానిలాగే అపురూపంగా ఉన్నాది" అన్నది దమయంతి.

గిరిజకు అర్థంకాక మూతి తిప్పేసింది.

## తార

"ఏమిటో! నా నోటికి తిరగని పేరేదో పెట్టాడు వాళ్ళ నాన్న" అంది సత్యవతి.

సాయంకాలంపూట స్నానం చేయించి, పౌడరు వేసి, తెల్లటి గ్లాస్కో గౌను వేసి, ఆరుబయట చాపవేసి, బొమ్మలు ముందరేసి కూర్చోబెట్టేది తార.

రబ్బరు బొమ్మలాగా, బొమ్మల్లో ఒక బొమ్మలాగా కూర్చుని ఆడుకుంటూన్న స్వప్న దగ్గరకు వచ్చేవాడు వెంకటరత్నం! తండ్రిని గుర్తుపట్టినట్లుగా ఆనందంగా కేరింతలు కొట్టేది!

"స్వప్నా! నా స్వప్నా!" అంటూ కూతుర్ని ఎత్తి ఎగరేసి పట్టుకుని గుండెలకు అదుముకునేవాడు. తలపై ముద్దు పెట్టుకునేవాడు! అరచేతుల్లో ముద్దులు పెట్టేవాడు! పొరపాటునకూడా బుగ్గలపై మాత్రం ముద్దు పెట్టుకునేవాడుకాదు. "నా కూతురి బుగ్గలు లేతగులాబీ మొగ్గలు! అవి మీ మొరటు ముద్దులకు వాడిపోతాయి!" అనేవాడు.

స్వప్న కోసంగా వెంకట్రామయ్యగారుకూడ త్వరగా ఇంటికి వచ్చేవారు. మనుమరాలి ఆటలు చూస్తూ పరవశులయ్యేవారు!

స్వప్న -- వెంకటరత్నం మిత్ర బృందానికో బంగారు కానుక! అతని మిత్రులందరూ తారను ఒదినా అనో, అక్కా అనో పిలుస్తుండేవారు! వెంకటేశ్వరరావు అందరిలోకీ చిన్నవాడు! స్వప్నను ఎత్తుకుని ఆడిస్తూ తారతో అనేవాడు – "అక్కా! నీ కూతురు పెద్దదై, మామయ్యా నేను పెళ్ళికి రెడీ అన్నాక నేను పెళ్ళి చేసుకుంటాను."

అపుడే స్నానంచేసి వస్తూన్న వెంకటరత్నం ఆ మాటలు విని ఫక్కున నవ్వాడు.

"అవునవును! అపుడు మా అమ్మాయికి ఈ ముసలి మొగుడే కావాలి కాబోలు!" అంది సత్యవతి.

దమయంతి, తార గలగలా నవ్వుతూంటే స్వప్న కూడా కిలకిలా నవ్వింది.

వెంకటేశ్వరావుకి నిజంగా సిగ్గేసింది.

* * *

సరళ భర్త రెండు మూడు సినిమాలల్లో వేషాలు దొరికాయనీ, ఇంక ఫర్వాలేదనీ, తన భార్యనూ, తన పిల్లలనూ తను పోషించుకోగలననీ చెప్పి, వాళ్ళను మద్రాసు తీసుకెళ్ళిపోయాడు.

సరళ మద్రాసు వెళ్ళిపోతూంటే తారకు వెళ్ళి చూసిరావటానికి కూడా వీలుకాలేదు. రెండు మూడురోజుల్నుంచీ కొద్దిగా జ్వరం తగిలినట్లుగా ఉంటున్నాది. పైగా శరీర పరిస్థితి ఎలా ఉన్నా ఇంటిపని చేసుకోక తప్పదుకదా! దీనికి తోడు స్వప్న ఇల్లంతా పాకుతూ నానా హడావుడి చేసేస్తున్నాది. గిరిజకేమో ఐదవనెల జరుగుతున్నాది. అన్నీ మంచం దగ్గరకే అందివ్వాలి! దమయంతికేమో పరీక్షలు! పాపం సత్యవతమ్మ చేయలేదు. అందువల్లనే రెండు రోజులు వచ్చి వెళ్ళమని చంద్రంతో కబురు చేసినా వెళ్ళలేకపోయింది! ఆ రోజుకు వెంకటరత్నం మాత్రం ఎలాగో తీరిక చేసుకుని స్టేషను దగ్గరకు వెళ్ళాడు

అట్లా వెళ్ళిన వెంకటరత్నం ఆ సాయంత్రం ఏడుగంటలవేళ, నలుమూలలా చీకట్లు క్రమ్ముకున్న వేళ కళ్యాణిని నూజెల్లకు తీసుకొచ్చి, ఇంటి వద్ద వదిలి "నేనిపుడే వస్తాను. నువ్వు లోపలకు వెళ్ళు" అని చెప్పాడు.

కళ్యాణి లోపలకు వచ్చింది.

లాంతరు దగ్గిర చదువుకుంటూన్న దమయంతి "అమ్మా! కళ్యాణి వచ్చిందే" అని అరిచింది.

వేడివేడి అన్నంలో గిన్నెడు నెయ్యిపోసి, కారంపొడివేసి కలిపిన అన్నం పళ్ళాన్ని మంచం మధ్యలో కూర్చున్న గిరిజకు అందిస్తూన్న సత్యవతి, "ఎక్కడే?" అంటూ తలఎత్తి చూసింది.

గదిలో వెంకటరత్నానికీ, స్వప్నకూ దుప్పట్లు దులిపి పడకలు సర్దుతూన్న తార చటుక్కున బయటకు వచ్చింది.

"బాగున్నావా కళ్యాణీ?" తార పలకరించింది.

"ఒదినా! నీకో విషయం చెప్పాలి" అంటూ తార చేయి పట్టుకుని గబుక్కున గదిలోకి లాగి తలుపులు వేసింది.

గదిలో మూలగా ఎత్తుగా ఉన్న స్టూలుపైన ఉన్న లాంతరును పట్టుకోవటానికి ప్రయత్నిస్తూన్న స్వప్నను ఎత్తుకుని "అది పట్టుకుంటే కాలుతుందే" అంటూ ముద్దుపెట్టుకుంది కళ్యాణి.

* * *






స్త్రీజీవితంలో
ఎంతో అందమైన క్షణాలలో
ఒకభాగం ఖటావ్

ఖటావ్‌వారి టెర్కోసా చీరలు 

Rediffusion K/1618e/TL

# తార

"ఏమిటి, వదినగారితో అంత రహస్యం ?" మూతిని మూడు వంకర్లు తిప్పుతూ అడిగింది గిరిజ

"వాళ్ళ అమ్మ ఏదో చెప్పమంటే చెబుతున్నాను. నీ ఒంట్లో ఎట్లా ఉంది ?" ఆ మంచంమీదే గిరిజ ప్రక్కన కూర్చుంది.

దమయంతి ఏవేవో కబుర్లు గబగబా చెప్పేస్తున్నాది. తార నెమ్మదిగా గది బయటకు వచ్చి వరండా స్థంభాన్నానుకుని కూర్చుంది. ఆమె ఒడిలో స్వప్న పడుకుని ఉంది. నిద్రపుచ్చటానికి అన్నట్లు ఎడమచేతితో జోకొడుతున్నా కూడా తార మనసు మాత్రం దేన్నిగురించో ఆలోచిస్తున్నట్లుగ ఎక్కడో శూన్యంలోకి చూస్తూ కూర్చుంది.

సరళ కొడుకు కబుర్లు చెబుతూ బిగ్గరగా నవ్వుతూన్న కళ్యాణి వరండాలోంచి లోపలక వస్తూన్న అన్నను చూసి చటుక్కున ఆపేసింది.

స్వప్నను భుజానికెత్తుకుని లేచినిలబడింది తార. ఏనాడూ లేనిది, ఇవ్వాళ క్రొత్తగా అన్నగార్ని చూడగానే కళ్యాణికూడా లేచి నిలబడింది.

మంచం దగ్గరగా ఉన్న ఆ ముగ్గురు అక్క చెల్లెళ్ళనూ ఒకసారి చూసి, గదిలోపలకు అడుగు వేసాడు. భుజంమీదుగా వెనక్కు తిరిగి "కళ్యాణికి అన్నం పెట్టారా ?" అన్నాడు.

"కళ్యాణి ! స్నానం చేస్తావామ్మా ?"

"ఉహుఁ - చేయనొదినా."

"అయితే కాళ్ళు కడుక్కో, స్వప్నను పడుకోబెట్టి వస్తాను."

తార గదిలోకి వచ్చింది. వెంకటరత్నం బట్టలు మార్చుకుంటున్నాడు. స్వప్నను మంచంపై పడుకోబెట్టి అటూ ఇటూ దిండ్లు సరిచేసింది బయటకు వచ్చేస్తున్నదల్లా ఒకే ఒక్క నిమిషం భర్త దగ్గర నిలబడి "కళ్యాణి నాకంతా చెప్పింది. ఆ పిల్ల చాలా పట్టుదలగా, మొండితనంగా ఉన్నది మీ పెద్దరికం చెడకుండా చూసుకోండి" అనేసి వెళ్ళిపోయింది

కళ్యాణి భోజనం అవుతూండగ వెంకట్రామయ్యగారూ, ఆ వెనుకే పెద్ద అల్లుడు వచ్చారు.

భోజనాలు ముగియగానే చెప్పుల్లో కాళ్ళు పెడుతూన్న తండ్రితో "మీతో కొంచెం మాట్లాడాలి నాన్నా! కాసేపు కూర్చోండి" అన్నాడు వెంకటరత్నం

అందరూ ఆశ్చర్యంగా చూసారు.

ఏమో అడగబోతూన్న సత్యవతమ్మకు అవకాశం ఇవ్వకుండానే "మీరు కూడా త్వరగా తినండి" చెప్పి గదిలోకి వెళ్ళాడు.

అన్నం తింటూ గొంతు తగ్గించి పెద్దగ కోడల్ని అడిగింది –

"ఏమిటే అది ? అందరిలోనూ మాటలాడ విషయం ఏమిటో నీతో చెప్పాడా ?"

"లేదత్తయ్యా, నాకేమీ చెప్పలేదు" తల వంచుకునే జవాబు చెప్పింది.

భోజనాలు పూర్తి అయ్యాయి.

చీరె కొంగుకు చేయి తుడుచుకుంటూ వంటగది అరుగు ప్రక్కగా గిరిజ కూర్చుంది

మంచానికి ఆనుకుంటూ కూర్చుంది సత్యవతి.

ఇంకో మంచంపై కూర్చుని వేరుసెనగకాయలు తింటూన్న వెంకట్రామయ్యగారు 'ఇహ మాట్లాడు' అన్నట్లుగా తినటం ముగించి డబ్బాపై మూతవేసి గట్టిగా కొట్టారు.

వరండా గట్టుపైన దమయంతి ప్రక్కన కూర్చున్న కల్యాణి మెల్లగా లేవటం గమనించిన వెంకటరత్నం ''నువ్వు కూడా కూర్చో కళ్యాణి !'' అన్నాడు.

వంటగదిలో గిన్నెలు సర్దుతూన్న తార చెవులు వరండావైపే కేంద్రీకరించి ఉన్నాయి.

పడక్కుర్చీలో వెనక్కువాలి కూర్చున్న వెంకటరత్నం సరిగ్గా కూర్చుంటూ ఒకసారి వంట గదివైపు చూసి, గొంతు సరిచేసుకున్నాడు.

''కళ్యాణి ఇపుడు గుడివాడలో ఉంటోంది. మీకు తెలిసే ఉంటుంది కదూ !''

''ఊఁ – మీ అమ్మ చెప్పింది.''

''అది గుడివాడలో ఎందుకు ఉంటోందో అడిగారా ?''

వెంకట్రామయ్యగారు భార్యవైపు చూసారు.

''అదేమిట్రా! అది అక్కడ హిందీ చదువుకుంటానంటే నేనే మీ నాన్నతో చెప్పి పంపించాను. ఇపుడేం జరిగింది? ఏమే – ఏం చేసావు?'' కళ్యాణిని అడిగింది.

''అక్కడ కళ్యాణి ఎవర్నో ప్రేమించిందట! 'పెళ్ళి చేసుకుంటాను' అంటోంది.''

వెంకట్రామయ్యగారు ఈ విషయం వింటూ చాలా ఆశ్చర్యపోయారు. పిల్లలు పెరుగుతున్నారని తెలుసుగానీ – ఇంతగా పెరిగిపోయారని ఆయన అనుకోలేదు. ఆయన అసలు ఏదీ అనుకోరు! ఇంట్లో ఉండాల్సిన పిల్లల్లో కళ్యాణి కన్పించకపోతే 'ఏమయిందీ' అనీ అడగరు. గుడివాడలో ఉంటోందని తెలిసింతర్వాత ఆ పిల్ల మళ్ళీ కన్పిస్తే 'ఎపుడొచ్చావు?' అనీ అడగరు. ఆయన తత్వమేమిటో అర్థంకాదు. అందుకే ఆ పిల్లలు అలా ...

సత్యవతమ్మకు చివ్వున కోపం వచ్చింది. ''ఏమే చదువుకుంటానని చెప్పి వెళ్ళి నువ్వు వెలగబెడుతూన్న ఘనకార్యం ఇదేనా?''

''నెమ్మదిగా మాట్లాడు. అందరకూ వినపడాలా? మనింట్లో భాగోతం అందరికీ తెలియాలి'' విసుగ్గా భార్యను మందలించారు వెంకట్రామయ్యగారు.

''ఏం ఊరు? ఏం చేస్తున్నాడు? అతను నీకు తెలుసా?'' కొడుకుని అడిగారు.

ఒక్క క్షణం మౌనంగా ఊరుకుని తర్వాత నిదానంగా చెప్పాడు. ''ఇంతకు పూర్వం ఒకటి రెండుసార్లు చూసాను. కానీ అతనితో నాకు పరిచయం ఏమీలేదు నాన్నా. ఇందాక, సాయంత్రమే అతన్ని బాగా చూసాను. పేరు సీతారామయ్య అట! ఊరు గుడివాడేనట! తల్లీ తండ్రీ చచ్చిపోయారట! ఒక్క అక్కయ్య మాత్రం ఉన్నాదిట, ఆమె పెళ్ళి చేసుకుని తెనాలిలో ఉంటున్నదట!''

''ఏం చదువుతున్నాడు?''

ఈ ప్రశ్నకు జవాబు వెంకటరత్నానికి తెలీదు. అందుకని కళ్యాణివైపు చూసాడు.

''నాకూ తెలియదు నాన్నా! ఏం కళ్యాణీ! అతనేమయినా చదువుకున్నాడా?''

''ఏం చదువుకోలేదు!'' తల వంచుకుని మెల్లగా చెప్పింది.

''అయితే ఆ పిల్లాడు నీకెట్లా తెలుసే?'' కస్సుమంటూ అడిగింది సత్యవతి.

''నువ్వు నోరు మూసుకుని కూర్చో'' కసురుకున్నారు వెంకట్రామయ్యగారు.

''వెనకాల ఏమయినా ఆస్తి అంటూ ఉందా?''

''ఏమో నాన్నా! అవన్నీ నేను అడగలేదు. కుర్రాడిని చూస్తే మాత్రం పెద్దగా ఉన్నవాడిలాగా ఏమీ అన్పించలేదు. కమ్యూనిస్టు పార్టీలోనే పని చేస్తున్నట్లున్నాడు.''

వెంకట్రామయ్యగారు వెంటనే ఏమీ అనలేదు. కానీ, సత్యవతమ్మ ఊరుకోలేదు. చేతులు చాపుతూ అన్నది – ''పార్టీలోనా! బాగానే ఉంది! ఇహ ఈ సంబంధం కబుర్లు చాలుగానీ లేవండి అక్కడ. ఇద్దర్నీ పట్టుకుని చెరో నాలుగు దులిపేసి బుద్ధి చెప్పక ఆ వివరాలు ఇంతదాకా తీసుకొచ్చావా!''

అపుడూ వెంకట్రామయ్యగారు ఏమీ మాట్లాడ లేదు.

''అదేమిటమ్మా! పార్టీలోని వాడనేసరికి అంత తీసేసినట్లు మాట్లాడతావు!'' చిన్నబుచ్చుకున్నట్లుగా అడిగాడు వెంకటరత్నం.

''లేకపోతే ఏమిట్రా! ఇదుగో–నువ్వున్నావుగా! ఇంటికి ఒక్కగానొక్క మగబిడ్డవి! నీకు ఏ మాత్రమయినా బాధ్యత ఉన్నదీ? అందరూ నీ ఈడువాళ్ళు ఎంతెంత సంపాదిస్తున్నారు! ఆ అంగిలూరు రామచంద్రం కొడుకు చూడూ – నీకన్నా ఒకరోజు పెద్ద! – వాడెంత పెద్ద మేడ కట్టించాడో తెలుసా?!''

''వాళ్ళకు ఇల్లు లేదేమో–కట్టించుకున్నారు! మనకుందిగా అమ్మా! ఇంకా మనకెందుకు?'' బలవంతంగా నవ్వుతూ అడిగాడు.

''ఒరేయ్! నీకు నేను బదులు చెప్పలేనురా! కళ్యాణిని మాత్రం ఆ పార్టీవాడి కివ్వటానికి నేనొప్పుకోను, అంతే!''

అప్పటివరకూ నిశ్శబ్దంగా కూర్చుని వింటూన్న కళ్యాణి చటుక్కున –

''నేను అతన్నే పెళ్ళి చేసుకుంటాను.'' పట్టుదలగా అన్నది.

ఛర్రుమన్నాది సత్యవతమ్మ.

''నోరుముయ్యవే దరిద్రపుదానా! చదువు







ఉంటానని గుడివాడ వెళ్ళి — నీ కిదేం పోయేకాలమే! నీ కిట్లాంటి పాడుబుద్ధి ఎట్లా పుట్టింది! మన ఇంటా వంటా లేవు — ఈ తప్పుడు పనులు! అవ్వ! నలుగురూ వింటే ఎంత నవ్వులపాలు!''

''ఆ జ్ఞానం నీకున్నదీ? నెమ్మదిగా మాట్లాడమని లక్షసార్లు చెప్పాను. ఎందుకట్లా కట్టుగొయ్యి తెంచుకున్న గొడ్డులాగా అరుస్తావు?''

''నేను అరుస్తున్నానా! నా అరుపులే మీ అందరకూ వినిపిస్తాయి! అది అటు ఏడు తరాలు, ఇటు ఏడు తరాలు చూసినా ఎవరూ చేయని తప్పుడుపని చేసి వాకిట్లోకొస్తే — చీర్చి పారెయ్యక అందరూ తీరికూర్చుని మీటింగు పెడతారూ, మీటింగు! చదివింది చాలుగానీ ఇహ ఎక్కడకూ కదలొద్దు. గడప దాటావంటే కట్టెపేడు కాల్చి వాతలు పెడతాను.''

''అదేమిటమ్మా, అలా మాట్లాడుతావు! ఆ ఏడు తరాలవాళ్ళ మాదిరిగానే మనమూ ఉన్నామా? నిన్నటికీ, ఇవ్వాల్టికీ తేడా ఉన్నట్లే — ఈ రోజుకూ రేపటికీ మార్పు ఉంటుందమ్మా! దాన్ని పంపించటం మన తప్పు! అంతా జరిగిపోయాక ఇహ ఇపుడు మనం గొడవ చేసుకుంటే వచ్చే ప్రయోజనం ఏమీ ఉండదు! జరగాల్సింది ఆలోచించటం మంచిది!''

అన్నగారి మాటలు వింటూన్న కళ్యాణి ఆనందంతోనూ, ఆశ్చర్యంతోనూ ఉక్కిరిబిక్కిరయ్యింది. సాయంత్రంనుండీ అన్నగారి ఆగ్రహం గమనించిన కళ్యాణి ఇంటికి తీసుకెళ్ళి ఏం గొడవ చేస్తాడోనని భయపడింది. కాని, ఇపుడు ఆయన మాటలూ, ఆయన వాదనా వింటుంటే—ఆ చీకట్లో ముఖాల్లోని భావాలు తెలియకపోయినా, అన్నగారి మాటల్లోని నిజాయితీని శంకించటానికి వీలులేకుండా ఉన్నది.

''వెనకాల చిల్లిగవ్వ ఆస్థి లేనివాడు, చదువూ సంధ్యా ఏమీ లేకుండా పార్టీలంటూ తిరిగేవాడు — అది సుఖపడుతుందనే అనుకుంటున్నావా?''

''అతనికి ఆస్థి లేదు! నిజమే! ఒప్పుకుంటాము! నీకుందిగా! నీ కూతురికి నువ్వు ఇవ్వు!''

''అదీ ఇదీ ఒకటే అవుతుందిరా! ఇహ ఆ విషయం ఆపేసి, దానికి ఎక్కడయినా మంచి సంబంధం చూడండి. ఎంత కట్నమయినా

## తార

ఫర్వాలేదు! ఆస్థి, అంతస్థూ ఉన్నవాడిని చూసి, తొందరగా పెళ్ళి చేసి, పంపించేస్తేగానీ నాకు మనశ్శాంతి ఉండదు వింటున్నారా?'' అంది భర్తతో.

''నాకే సంబంధాలూ చూడొద్దు! నేనతన్నే చేసుకుంటాను. ఇష్టమైతే మీరే ఈ పెళ్ళి చేయించండి. లేకపోతే నేనే వెళ్ళిపోయి అతన్ని చేసుకుంటాను.'' కరాఖండిగా చెప్పింది కళ్యాణి.

కళ్యాణి మాటలకు వెంకట్, వెంకట్రామయ్యగారూకూడా ఆశ్చర్యపోయారు. సత్యవతమ్మ చరచరా వచ్చి చెంపమీద లాగి ఒక్కటి బలంగా ఇచ్చింది.

గబుక్కున వెంకట్ లేచి తల్లిని ఇవతలకు తీసుకొచ్చాడు, ''తొందరపడకమ్మా'' అంటూ.

''ఇంకా నన్నే మందలిస్తున్నావా! ఇహ లాభం లేదుకానీ, తొందరగా ఒక మంచి సంబంధం చూసి ఈ పీడ విరగడచేయండి.''

''అలాగే చేద్దాం కానీ! నువ్వు ఆవేశపడకు.'' అన్నాడు వెంకట్!

''నాకా కబుర్లు చెప్పకు. దాని పీక పిసికేయాలన్నంత కోపం ముంచుకువస్తూంటే — ఇంకా ఆవేశపడవద్దని చెబుతున్నావా? ముందరో మంచి సంబంధం చూసి దాన్ని బయటకు పంపేసెయ్యి, ఆ తర్వాత చెప్పు నీ కబుర్లు!''

''సరి! అలాగే కానీ — మంచి, మంచి అంటున్నావు కదా! మంచి అంటే ఏమిటి?''

''మీలాగా పార్టీ గొడవలు లేనివాడు, వాడిలాగా అణాకానీ కూడా లేని సన్యాసి కానివాడూనూ! తెల్సిందా?'' కోపంగా అన్నది సత్యవతి.

''అంటే ఆస్థులుండటమే మంచి కర్థమా? అయినా ఉన్నవాడు ఉన్నవాడికే ఇస్తేంటే ఇహ లేనివాడు లేనివాడుగానే ఉండక ధనవంతుడెట్లా అవుతాడు? ఎపుడు మారతాడు?''

''ఒరేయ్! ఈ కబుర్లన్నీ స్టేజీలమీద చెప్పు! నా దగ్గరకాదు!''

''కన్నతల్లికే చెప్పలేనివాడిని, బయటివాళ్ళకేం చెప్పగలను! అయినా డబ్బులోనే సుఖంలేదమ్మా, సుఖంగా బ్రతకటానికి డబ్బు కావాలి. నిజమే! కానీ, డబ్బులుంటేనే సుఖంగా బ్రతుకుతారు అని మాత్రం అనుకోబోకు. దానికి అతను నచ్చాడు! అతనితో సుఖంగా బ్రతకగలను అని అది అనుకుంటోంది! అందుకని దాని కోరిక తీర్చటం మన బాధ్యత!''

''చాల్లేగానీ, నోరు మూసుకోరా! ఇహ ఈ కబుర్లన్నీ నాకు చెప్పకు! నచ్చాడట — నచ్చటం! దాని మొహం! దానికేం తెలుసు! మంచీ, చెడూ, వంశం, సంప్రదాయం, కులం, గోత్రం — ఏమీ చూడకుండానే దానికి నచ్చాడని చెప్పి పెళ్ళి చేసేస్తామా? అయినా పిల్ల తెలిసో, తెలియకో వాడి వెంబడి తిరుగుతూంటే ఆ యింట్లో పెద్దవాళ్ళు కాస్త మందలించకూడదూ! పిల్ల మనది కాదులే అని అనుకోబట్టేగా అట్లా గాలికి వదిలేసారు.''

చటుక్కున బయటకు వచ్చింది తార.

''ఇహ నోరు ముయ్యి! ఆ నోటికి ఎంత వస్తే అంతా వాగెయ్యటమేగానీ, ఆలోచనెప్పుడేడ్చింది నీకు! ఒళ్ళు పొగరెక్కి, కళ్ళు మూసుకుని నీ కూతురు వెధవ తిరుగుళ్ళు తిరుగుతూంటే వాళ్ళు కాపలా కాస్తారా! వెధవ వాగుడూ, నువ్వూనూ! అది అడగంగానే తీసుకెళ్ళి గుడివాడలో పెట్టటం నీ తప్పు! అది ఇవ్వాళ ఈ తైతక్కలాడటానికి కారణం నువ్వు! నీ బుద్ధిలేనితనం మూలానకాదూ ఇంత అనర్థం జరిగింది! అది చాలక ఇంకా వాగుడుకూడానూ! దీనిలో నువ్వేమీ జోక్యం చేసుకోబోకు! నేనూ వాడూ కలిసి ఏంచేయాలో ఆలోచిస్తాం!'' వెంకట్రామయ్యగారి మాటల్లో హద్దులు మీరుతూన్న ఆగ్రహం స్పష్టంగా కన్పిస్తున్నాది!

''చూడండి! మీరంతా కలిసి దానికి ఆ సంబంధమే ఖాయం చేసేట్లయితే నేను నూతిలో పడి ప్రాణాలు తీసుకుంటాను.'' ఏడుస్తూన్న గొంతుకతో బొంగురుగా అంది సత్యవతమ్మ.

''అమ్మా'' ఖంగారుగా వారించబోయాడు వెంకటరత్నం.

''నువ్వేమీ భయపడబోకురా. మీ అమ్మ ఇప్పటికి చాలాసార్లు నూతిలో దూకుతూనే ఉంది! దాని మొహం! దానికి నూతిలో దూకే ధైర్యం ఎక్కడేడ్చింది!''

(ఇంకా వుంది)

# వేడి మీ శక్తిని పిండి పిప్పిచేస్తున్నప్పుడు...



ఇది మీరు నమ్మిన గ్లాకోస్జ్-డి యొక్క కొత్త పేరు

# గ్లూకోన్-డి ® తీసుకోండి

**అదనపు శక్తి కోసం—అలా మీకు కావలసినప్పుడల్లా.**

అలసట కలిగించడంలో వేడిని మించిందిలేదు. అలా వేడి వాతావరణంలో పనిచేస్తున్నప్పుడు అలసట, దాంతో పాటే నీరసం వచ్చేస్తుంది. అప్పుడే మీకు కావాలి ఉత్సాహాన్నిచ్చే, చల్లదనాన్నిచ్చే గ్లూకోన్-డి. అది మీకు అదనపు శక్తిని ఇస్తుంది. అలా మీకు కావలసినప్పుడు.

గ్లూకోన్-డి, లక్షలాది మంది 30 ఏళ్ళుగా విశ్వసిస్తూ వస్తున్న గ్లాకోస్జ్-డికి కొత్త పేరు. పళ్ళరసం, పాలు, టీ, కాఫీ, నీళ్ళు—దేనిలోనైన అలా దాన్ని కలుపుకు తాగండి లేక దేనితో కలపకుండా అలాగే తాగండి. శక్తి అలా ఉరకలు వేస్తూవచ్చే అనుభూతిని పొందండి.

గ్లూకోన్-డి మీ కుటుంబంలో నివారందరి కోసం. పనుల్లోనూ, ఆటల్లోను వారికి చురుకుదనం కోసం. గ్లూకోన్-డి—అందరికీ పరిచయమున్న అదే పచ్చ ప్యాక్‌లో వస్తుంది.






**విటమిన్ డి, కాల్షియం ఫాస్ఫేట్‌తో బలపరచబడిన అసలైన గ్లూకోజ్ పౌడర్—గ్లాక్సో సమర్పణ**

HTB-GLL-6737-TG

## వి. ఆర్. కె — గుంటూరు

సినిమా తీస్తున్నారటగా ? నన్ను హీరోగా పెట్టుకుంటారా ?

★ ఏం బాబూ — నే బాగుండడం మీకిష్టం లేదా !!

## డి. జె బి — విజయవాడ

మీ నవల 'కొత్త మలుపు' ఆధారంగా న్యాయం కావాలి చిత్రం నిర్మించారు. చూశాను.

★ అయ్యో జవ్వార్ బాబూ, ముందు విషయ సేకరణ కరెక్టుగా వుండాలి. తరువాత విమర్శించాలి. అది నా నవల కాదు. నేనింకా పెళ్లికిముందే కడుపు దాకా పోయే ప్రేమికుల కథలు రాయలేదు ! ఈ విషయంలో నేను చాలా ఛాందసురాల్ని.

## బి వి. ఆర్. — విజయనగరం

జీవితంలో పనికిరాని వస్తువేమీలేదు కదా ? అది ఏది ?

★ నేను — నేను అనుకునే తత్వం — శుద్ధ దండగ అని నా అభిప్రాయం.

ఆరుద్ర కవితపై మీ అభిప్రాయం ?

★ కవిగానూ, వ్యక్తిగానూ కూడా నాకు చాలా యిష్టం.

## జి. ఎల్. డి — ఏలూరు

మీ ప్రశ్నావళి నాకు చాలా యిష్టం. నిన్ను చూడాలని మాట్లాడాలని చాలా కోరిక. పర్సనల్ లెటర్సు రాయడానికి వీలుంటుందా ?

★ ప్రశ్నావళి పాఠకులతో నాకు పర్సనల్ లెటర్సు కుదరవు. (అయినా కలం స్నేహం — వ్యక్తిత్వం విలువలు గుర్తించిన వారి మధ్యగాని — ఎదిగీ ఎదగని వ్యక్తుల మధ్య — రాణించవు. ఒకసారి సోదరీ అంటారు. బదులిస్తే — ప్రేమిస్తున్నానంటే — ఏం చెయ్యాలి ? — ఉత్తరాలు రాయడం కూడా ఒక కళే. ముందు నేర్చుకోవాలి.)




## డి. జ. ఆర్. — మద్రాసు

జీవితం నిస్సారవంతం అయినప్పుడు బ్రతకడం మంచిదా, ఛావడం మంచిదా ?

★ 'జీవితం భారం అనిపించినప్పుడే చుట్టూ కలయచూడాలి' అని చెప్పేది — మా మదర్ సుపీరియర్. పూచే ప్రతి పువ్వూ, పాడే ప్రతి పిట్టా... దేనికోసం ఆనందిస్తున్నట్టు ? ఏ కాలి కిందో నల్గిపోయే పువ్వూ ఏ వుండేలు బద్దకేనా బలి అయే అవకాశం వున్న పిట్టా ఎదురుచూస్తూ బ్రతకడంలేదా ? అలాంటి అల్పజీవులే — మనకి గట్టి గురువులు. కష్టనష్టాలని భరిస్తూ — ఆ ఇంద్రధనుస్సు చివర వుందనే బంగారు బిందె కోసం — ప్రయత్నిస్తూనే వుండాలి.

## కె. బి ఎల్ — నెల్లూరు

ప్రేమ ఆడదానికి సంకెళ్లు మరి మగవాడికి?

★ గంతలు కావాలి. లేకపోతే కళ్లెం అన్నా తప్పులేదు.

మనిషిలో అతి విలువైనది ఏది ?

★ సహృదయత.

మనసు కంటే వేగం అయినది ఏది ?

★ కోరిక.

## ఎమ్. జె. వి. ప — పత్తికొండ

లోకంలో ఎవరికైనా మొదటి వ్యక్తి చివరి వ్యక్తి కన్నతల్లి అని నేనంటాను ?

★ అయితే మరి ఇతర వ్యక్తులంతా — ఎందుకు మన జీవితంలో ప్రవేశించడం ?! కన్నతల్లి మట్టూ జీవితం అల్లుకుంటుంది ఆమె ప్రోత్సాహంతో అది విస్తరించి చిలవలూ పలవలూ అవుతుంది. అంచేత — భార్యని ప్రేమించడం తల్లిని మరిచి పోవడం అనుకోకూడదు.

మీరు రచించడంలో, జవాబులు యివ్వడంలో మీకు గల అర్హత ఏమిటి ?

★ ఏమీ లేదు. మీకంటే ముందు ఈ రంగంలో ప్రవేశించడమే !!

## ఎస్. ఎమ్. — కొవ్వూరు

లేడీస్ పోలీసు ట్రైనింగు ఎక్కడవుంది ?

★ ఏ పోలీసు స్టేషనులో అడిగినా దీనికి సంబంధించిన వివరాలు చెప్తారు.

## కె. ఎస్ — రాజమండ్రి

పెళ్లయిన తరువాత మగాళ్లకు గ్లామరు తగ్గిపోతుంది అంటారు నిజమేనా ?

★ నిజమే. ఎందుకంటే — ఎంత నైరివేషాలు బయట వేసిన వారి ముఖంలో అంతో యింతో 'గిల్టు' కాంప్లెక్సు కనబడిపోతుంది !

## ఎ ఎ. ఎమ్. — పెరికీడు

మండే అగ్గిపుల్లకీ, ఎగిసిపడే పడుచుపిల్లకీ తేడా ఏమిటి ?

★ ఏమిటీ స్టుపిడ్ సందేహం. ఆడపిల్లవై వుండీ ఏ థర్డ్‌రేట్ సెక్సు పాటలోంచో మాటలు గుణించి అడగడం బాగులేదు. పడుచుపిల్ల అయినంత మాత్రాన సిగ్గులేకుండా వుండదు. అలా వుంటే సిగ్గు పడవలసిన విషయం అది. ★








# పరుసవేది

డాక్టర్ పి.వి.రమణ

చీకటి గూడులో కుమిలిపోతున్న వెలుగు. ఆ వెలుగును వెలికి తేవాలనే ప్రయత్నంలో చీకటిని వేటాడే లారీ కళ్ళు. రెక్కలు తెగిన పక్షి పైకెగర టానికి చేసే విఫల ప్రయత్నంలాటిదే ఆ వేట. గతుకుల రోడ్డు. రంగసామి చేతుల్లో ఆటబొమ్మలా ఆడుతున్న లారీ. పగలు అభయహస్తాన్ని చాపి చలువ దీవెనలిచ్చే చెట్లు, భయంకరంగా నిల్చున్నై. మంత్రోచ్ఛారణ చేసే మునుల్లా వింత శబ్దాలను వల్లిస్తున్నాయి. ఈ యుగాల తిరుగుడు తనవల్ల కాదన్నట్లు క్షీణించిపోయిన చంద్రుడు. లారీ కళ్ళు గక్కే వెలుగు రేఖల్లో క్షణకాలం స్ఫటికం పొరల్లా కన్పించే రోడ్డు, ఆ రేఖలు దాటగానే మరింతగా అంధకార కూపంలో కూరుకుపోతూంది.

దూరంగా ... ఆ చీకటి వెలుగుల వింత మిశ్రమంలో ... ; అద్దంలోనుండి మత్తు కళ్ళను చికిలించుకొంటూ, ముద్ద కట్టుకుపోతున్న ఒళ్ళును విదిలించుకొంటూ చూశాడు రంగసామి. బంగారు లేడి దొరికినట్లు రంగసామి మనసు రెపరెపలాడింది. మత్తుతో కుస్తీ పట్టీ పట్టీ నుస్తీ చేసినట్లు నిల్చిపోయిన రెప్పలు తిరిగి కొట్టుకొన్నై. నర నరంలో సంచలనం. రంగసామి నేదో ఆవహించ బోతున్నది. నేలను నలుపుకొంటూ, కీచుమంటూ ఆగింది లారీ.

"ఎక్కడికి పోతున్నది లారీ ?" మోహన్ ప్రశ్నలో ఆరాటం. ప్రక్కన యువతి. కాదు; వెర్రిగా కురిసే చీకటిలో వెలిగిపోయే మెరుపు. కూరుకుపోయిన రంగసామి కనురెప్పలు విశాలమైనై. దృష్టి మెరుపుపై నిల్చింది. అయస్కాంతానికి అతుక్కు పోయిన ఇనుపముద్ద రంగసామి.

"ఈ లారీ ఎటుపోతూంది ?" మళ్ళీ ప్రశ్నిం చాడు మోహన్.

"ఎందుకు ?" అతుక్కుపోయిన రంగసామి పెదాలు విడివడ్డాయి తిరుగలి రాళ్ళలా.

"ఆఖరి బస్ తప్పిపోయింది. అర్జంటుగా హైద్రాబాద్ పోవాలి."

"ఇది ఆ వైపే"

"ఎంత డబ్బైనా ఇస్తాను. మా ఇద్దర్నీ హైద్రాబాద్ చేర్చు."

"ఎక్కండి."

లారీ పోతున్నది. అలలు అలలుగా చీకటి. అల్పంగా దాన్ని చీలుస్తూ హెడ్‌లైట్స్ వాడి కత్తులు; తెగిపోతున్న చీకటి శరీరం. మళ్ళీ అతుక్కు పోతున్న అంధకారం.

"రాజీ, ఏమిటిది... 'ధైర్యంగా ఉండాలి" అనునయిస్తూ మోహన్.

"ఊహుఁ... నావల్లకాదు మోహన్; నేనుండ లేను" ఏడుపును బిగపడుతూ రాజీ.

"చూడు రాజీ... అవకాశాలు మనమను కొన్నప్పుడల్లా రావు. నాకుమాత్రం నిన్నొదిలి వేరే దేశం పోవాలని ఉందా ?" వేదనలో నిమజ్జన మవుతున్న రాజీ... వెక్కిళ్ళతో ఎగసిపడుతున్న రాజీ... వియోగాన్ని తల్చుకొని విలపించిపోతున్న రాజీ...

"పోనీ ఉండిపోనా ?"

అంత బాధలోనూ తల అడ్డంగా ఊపింది రాజీ. మోహన్ గుండెలమీద మూపుడువేలితో వ్రాస్తూ అంది –

"వెళ్ళాలి."

"మరి"

"ఇక ఏడవను."

"రాజీ..."

"ఈ జీవితమంతా ఇట్లాగే ఉండిపోనీ... నీ వొడిలోనే వొదిగిపోనీ" ఊగిసలాడే గుండెల్తో అంది రాజీ. యుగయుగాలనుండీ పొత్తుకుపోయిన అనుబంధాల మధుర ప్రేమార్చనా ఫలం; నీలాకాశాలు, అగాధ సాగరాలు, గిరి శిఖరాలు, అనంతలోయలు మరెన్నో ప్రకృతి మనోహర కిరీటాలపైన మనోజ్ఞంగా విన్పించే తీయని గానం; తళతళలాడే వెన్నెల ఆప్యాయతా పలుకరింత – ఇదే ప్రేమ అయితే అదిప్పుడు రాజీ, మోహన్‌ల పారవశ్య పంజరంలో బందీ. రాజీ ఇప్పుడొక వెన్నెలరేఖ. ఈ భువికి జారిపడ్డ చందమామ ముక్క.

"రాజీ... చిన్నప్పుడు చూసి నవ్వుకొనేవాళ్ళం, పొట్టను కరచిపెట్టుకొన్న పిల్లతోసహా కోతి ఎగరటం... నీవూ అట్లానే" రాజీ వీపుమీద







# పరుసవేది

మతారంగా స్పృశిస్తూ మోహన్. రాజీ నవ్వింది ముద్దదీపంలా. ఆవరించిన అంత చీకట్లోనూ చిరువెలుగు.

అడవి... దాహం...మోహదాహం... కామం... రాక్షసి కామం... రంగసామి నరాలలో హోరు; కాబిన్ వేడి; నరాల వేడి... కామదాహం వేడి... తాపం... కాగిపోయే దేహం...పరకాంతతో పరవశించి పోవాలన్న పైశాచిక ప్రవృత్తి... ప్రకోపం... వెర్రిగా కురిసే చీకటి... మరింత వెర్రిగా చీలిపోయిన సృష్టి; మోహన్ వడిలో వొదిగిన రాజీ... కామప్పొరలతో కప్పుకుపోతున్న రంగసామి... గాజు పెంకులు... రత్నాల కుప్పలు... మసిబొగ్గు... మంచుధార... నిప్పు... నీరు... త్యాగం... స్వార్థం... ఓహ్ రంగసామీ; రాకాసి కొడకా... స్టీరింగ్‌మీద ఒక్క గుద్దు గుద్దాడు రంగసామి ఆలోచన త్రాచులు కాటు వేస్తుంటే;

రాజీ అదిరిపడింది. మోహన్‌లో కంగారు. కంట్రోలు తప్పిన స్టీరింగ్; రోడ్డు అంచువరకూ వెళ్ళి మళ్ళీ రోడ్డుమీదకు వచ్చింది లారీ.

"ఏమిటి ? ఏమైంది ?" ఆత్రంగా అడిగాడు మోహన్

ఏమీలేదన్నట్లు తలాడించాడు రంగసామి.

"నిద్ర వస్తున్నదా ?"

మళ్ళీ అడ్డంగా తలూపాడు రంగసామి.

కాబిన్ వేడి...రాజీ నిశ్వాసాలవేడి...రంగసామి సగం విరిగిన చూపులు రాజీమీదే లైటు వెల్తుర్లో గమనించింది రాజీ...భర్త ప్రక్కనున్న స్త్రీలవైపు ఇవేం చూపులు ... భయంకరంగా...అసహ్యంగా ... "అందుకే ఇటువంటి మనుష్యులంటే తనకు ఏవగింపు" తనలో తనే గొణుక్కొంది రాజీ.

లారీ ఆపాడు రంగసామి. రోడ్డుమీది టీ బట్టీ వైపు నడిచాడు. లారీపై నుండి క్లీనరూ దిగి రంగసామి ననుసరించాడు. 'ఛాయ్' తాగబోయాడు రంగసామి.

"ధూ ... నీవ్వు...ఏందిది ? ఇది ఛాయవా... ఏందీ రంగు ?" ఛాయ్‌వైపు పరీక్షగా చూశాడు రంగసామి; పట్టీ పట్టీ చూశాడు.

"ఎవరిదీ బొమ్మ ... అవును ... కాబిన్‌లోని మెరుపు బొమ్మదే" ఆత్రంగా ఒక గుటకవేశాను; ఆనందంగా మళ్ళీ గ్లాసువైపు చూశాడు. "అరె ... బొమ్మ మారింది... ఎవరిది ? లచ్చిదా ... మా లచ్చిదే...!" గ్లాసువైపు పిచ్చి పటినట్లు చూస్తుండి పోయాడు రంగసామి. రంగసామి మనసు మైకప్పొరలు చీలుకుపోతున్నై. తైతక్కలాడుతూ గతం తాలూకు క్రీడలు ...

"మామా !"

" ........."

"విన్నే ... ఏటది ఉలకవ్ ?"

"ఏటో సెప్పరాదు" వినుక్కొన్నాడు రంగసామి.

"వోనరు బాబుకు ఓ మాట సెప్పరాదూ !"

"ఏటది ?"

"రాతిరేల డూటీ ఏయొద్దని."

"ఎందుకేటి ?"

"నే నొక్కత్తినే ఈడ; నా కేటోగా ఉంటది... బయంగా, ఎలితిగా ఉంటది... బాదగా ఉంటది... బరువెట్టినట్టుంటది."

"నే సేయకపోతే డూటీ మరెవడు సేస్తాడే నీ మొగుడు." లచ్చిమి ఆ ఆరాటంలోనూ అబ్బురంగా నవ్వింది. కొలనులో తామరపూరేకులు ఊగినట్లు. . కరెంట్ బల్బు ఆరి వెలిగినట్టు.

"ఎందుకేటి ఆ యెకసెకం ?"

"ఎకసెకం కాదు మామా... ఏడుకేసి నవ్వా. నా మగని సెమత్కారం చూసి నవ్వా."

"ఏందా సెమత్కారం ?"

"ఎవుడు సేస్తాడు రాత్రేల డూటీ నా మగడి కంటే."

"వూ... కూతలవడింది."

"మరి సెప్తావా మామా... వోనరు బాబుకు."

"ఎందే సెప్పేది ? రాత్రేల డూటీలో సుకం నీకేం తెలుసుద్దే."

"అవున్లే... నాకేం తెలుసుద్ది... కడుపునిండా సారా... కావాల్సిందాంతో ఎకసెకం... నీకూ ఓ యిల్లుందనీ, ఇంటిది...అగ్గిసొచ్చిగా మనువాడింది ఎదురు సూత్తావుంటదనీ నీవు ఆలోసిత్తేగా ? ఆ అవుసరం నీకొత్తేగా... నా అదురుట్టమిది; పవలు, రేత్రి యిసయం తెలీని ఎర్రిబతుకు... పోనీ పగటేలన్నా పది నిముసాలు ఇంటికాడుంటావా అంటే అదీలేదు..."

"ఏంటేవ్ నీయవ్వ... లారీ ఇరిగే లోడెత్తన్నావ్..."

"నా రాత" విట్టూర్చింది లచ్చి.

"ధూ నీవ్వ వాయి" గ్లాసు విసిరికొట్టాడు రంగసామి.

టీ బట్టీ ఊగిపోయింది; దాని యజమాని తికమకపడ్డాడు. గ్లాసు పగిలితే పగిలింది. దాన్ని గూర్చి అడిగితే తన బుర్రే పగలొచ్చు. పగిలిన ముక్కలవైపు చూస్తుండిపోయాడు యజమాని. రంగసామి లారీవైపు బయలుదేరాడు. గతం గుండెల్ని రాపిడిపట్టే పీడకల; ఆ జీవితం నిరంతరం రాజుకొనే నిప్పులకుండ. గడ్డకట్టిన స్వార్థం తాలూకు కాఠిన్యం... ముద్రలు పడ్డ కామం కోరలు కాబిన్ డోరు తెరచి లారీలో కూర్చొన్నాడు రంగసామి. లారీ కదిలింది. ఈ చలనానికి, చైతన్యానికి దూరంగా అల్లుకుపోయిన అవయువాలు. రాబోయే ఎడబాటుకు తల్లడిల్లిపోతున్న హృదయాలు

"నీకు దూరంగా నేనుండలేను మోహన్."

"పిచ్చి రాజీ... నీవు లేందే నేనుమాత్ర ముంటానా ! నీవు ఎదురు చూస్తున్నంతలోనే తిరిగి వచ్చేస్తాగా..."

"ఈ శోభ, ఈ కన్నీళ్ళు నీ కర్థంకాదు మోహన్. నీ వొళ్ళో నాకు ప్రాణం పోయినా హాయిగానే ఉంటుంది" రాజీ జుట్టును ఆప్యాయంగా నిమిరాడు మోహన్.

రంగసామిలో తిరిగి కంపరం. రాహు కేతువుల సంచలనం. దేవతలకు యుద్ధం చూట్టం సరదా. రాక్షసులకు చేయటం సరదా. రంగసామి ఎదలో అగ్నివర్షం. ఎరుపెక్కిన కళ్ళు. మనసును అదేపనిగా చిలుకుతున్న రాక్షస కాంక్షల కవ్వం. పెంట్రుకలు నిక్కబొడుచుకొన్నై. కుడిచేత్తో ముఖంమీది చెమటను తుడుచుకొన్నాడు. ఉలిదెబ్బతిన్న రాయిలా అయిపోతున్న దతని ముఖం. మళ్ళీ సడన్ బ్రేక్‌తో లారీని ఆపాడు సైడ్‌గా. మోహన్ వొడిలో వొదిగిన రాజీ తలెత్తకుండానే చికాకుపడింది.

"ఏమైంది ? ఏమైనా రిపేరా ?" అమాయకంగా అడిగాడు మోహన్.

ఆ అమాయకత్వం, ఆ నిర్మలత్వం, ఆ ప్రశాంతమైన కళ్ళు, ఆ కళ్ళనుండి చిమ్ముకొచ్చే కాంతి, ఇవే రంగసామి గుండెల్ని కోస్తున్నై. మనసును మథనతో మరగబెడుతున్నై.

"ఈడి ముకంవేపు సూడగూడదు.. నా సేతులు, బుర్ర పని సేయటంలేదు" సణుక్కొన్నాడు రంగసామి.

"ఏం కాలే; యింజన్ ఏదన్నా ట్రబుల్ ఇచ్చిందా అని సూత్తున్నా" కరిగిపోయే మబ్బులా నిర్వీర్యమవుతూ చెప్పాడు రంగసామి.

లారీ ముందుకు కదిలింది. మోహన్ వొళ్ళో తలదాచుకొన్న రాజీ కళ్ళల్లో జలపాతాలు. అంత రంగంలో క్రమ్ముకుపోతున్న ఆవేదనా పొగమంచు. ప్రేమ — జీవాత్మల అంతరింగిక రవళికి లయగా నర్తించేదే జీవితమేమో; ఆ జీవితంలో పూచే చిరు నవ్వులు, హరివిల్లులు, లాస్యం, పారవశ్యం వీటిని పరస్పరం పెనవేసుకొంటూ పెంచుకొనేదే ప్రేమేమో.

"ఏట్నైంది నాకీఏం! నీయవ్వ సేతులు ముందుకు రాటంలా. ఈడి బుర్రను బద్దలుసేసి ఆ మెరపును ... ఆ బొమ్మను ... తను...కసిదీరా... ఏటో దీనెమ్మ సేతులు కట్టుకుపోతున్నై. మనసు మొద్దు రాయవుతూంది. ఈ కుర్రెదవ దగ్గరేదో మంతరం ఉంది. ఆ మంతరం పెట్టే ఈడా పిల్లను కుక్కలా దిప్పుతున్నాడు ... ఆ పిల్ల ... ఆ పిల్ల ... యీాడి వొళ్లోనే ... నీ యవ్వ ... ఇటు పక్క ... నేనూ మగాన్నే ... నేను సూత్తాన్నా ఆలోచనే లేదీపిల్లకు ... పొద్దస్తమానం ఆ డొళ్లోనే ... ఈలిద్దరి యిసయం ... ప్రేమంటే ఇదేనా ... ? అయితే మరి లచ్చితో తాను ఎప్పుడైనా ఇట్టా గడిపాడా ... దాని బుగ్గలమీద సేయేసి ... ఆ కోరిక కప్పుడు తప్ప ... అసలు దానిమాట యిన్నాడా ... " రంగసామిలో అంతరంగ మధనం. గతానుభూతుల త్రొక్కిసలాట.

ఆలోచనల్లోనే మరో ఊరు వచ్చింది. రోడ్డు వారగ లారీని ఆపాడు. 'ఛాయ్' కోసం దిగుతూ ఆ జంటవైపు చూశాడు, వాళ్ళూ దిగుతారేమోనని. వాళ్ళీ లోకంలో లేరు. రంగసామి కరుకు హృదయం నుండి ఒక పొర విడిపోయింది రంగసామిని 'క్లీనర్' అనుసరించాడు. ఇటువంటి అవకాశాన్ని అందునా అర్ధరాత్రి వేళల్లో ఏనాడూ విడిచిపెట్టని రంగసామి వేపు అయోమయంగా,అనుమానంగా చూశాడు క్లీనర్.

"ఏటి గురూ ... ఇట్టా సేశావ్ ... ఏ టయిమప్పుడు సైగ చేత్తావా అని కళ్ళిట్లానే పెట్టుకొని కాబిన్‌పైన కూకుండా" తన తప్పులేదన్నట్లుగా చెప్పాడు క్లీనర్.

"దేనికిరా పిలవటం నిన్ను ?"

"దేనికేటి గురూ ... ఆ పిల్ల ... "

"ఛవ్ ... నోరెత్తకు ... పిసికేత్తా; అల్లు కొత్తగా మనువాడినట్టున్నారా...అల్లని ఎడదీయటం కిరాతకం" ముందుకడుగులేస్తూ అన్నాడు రంగసామి.

"గురూ సెడిపోయాడు" నిర్ధారించుకొని గిల్లగిల్లాడిపోయాడు క్లీనర్; మృగరాజు నాశ్రయించే అల్ప జీవాలకు వేటలో అంతో ఇంతో భాగం దొరుకుతుంది గదా;

రంగసామి చేతిలో ఛాయ్‌గ్లాసు. ఆ గ్లాసులో లచ్చి రూపం. ఈ తఫా ఆ 'ఛాయ్'ని పారబోయ లేదు రంగసామి. లచ్చి రూపాన్నే చూస్తుండి పోయాడు.

"మామా ... నీకు దండం పెడతా; నన్ను కొట్టు, తిట్టు, సంపు ... నీ యిట్టం ... నన్ను మాత్తరం యీాడనుండి పంపకు ... " కాళ్ళు పట్టుకు ప్రాధేయపడుతూ లక్ష్మి. తన రాతి గుండె మీద నీళ్ళు చల్లినట్లుగా అన్పించినై ఆ మాటలు.

"నా యవ్వారాల్లో యేలొట్టద్దని సెప్పీ సెప్పీ యిసిగిపోయా ... ఇక కుదర్దు ... నీకూ . నాకూ ఎట్టాఁట్ట పొసగూ కుదర్దు ... నీ పుట్టింటి కాడకెల్లు."

"మామా ... మామా ... పుట్టింటికాడకు మాత్తరం పోలేను ... సుట్టూజేరి పరాసికా లాడతారు ... ఆ నరకం నాకొద్దు మామా ... యీాడనే నీ కాల్లకాడనే పడివుంటా."

"లే సీయవ్వ... లేదా నరికేత్తా ముక్కలు ముక్కలగా."

"నరుకు మామా... నాకదే సంతోసం."

"కూతలు నేరిసింది పిట్ట" తన కాళ్ళు పట్టుకొని గింజుకొంటున్నా బలవంతాన లచ్చిని బయటకు గుంజి... రిక్షా ఎక్కించి..."

బుర్ర పట్టుకొన్నాడు రంగసామి. గతం కొలుక్కుతింటున్నది. ఆత్రంగా ముందున్న చాయిని తాగాడు. కాళ్ళల్లో వణుకు. గుండెల్లో ఏదో మూల కలుక్కుమంటున్నది. లారీ వద్దకు వచ్చాడు రంగసామి.

లారీ దూసుకుపోతున్నది. చీకటి చెదిరి పోతున్నది. వేకువ రేకులు విచ్చుకొంటున్నై.

"ఇక్కడాపు... ఆటోమీద వెళ్ళిపోతాం" అచేతనంగా లారీ ఆపాడు రంగసామి.

"ఎంతివ్వాలి ?" పర్సు చేతిలోకి తీసికొంటూ అడిగాడు మోహన్.

"ఏం అవుసరం లేదు... ఎల్లిరండి..." రంగసామిలో మొలకెత్తబోతున్న ప్రసన్నత.

"ఎంతో కొంత తీసికో"వత్తిడి చేయబోయాడు మోహన్.

"ఏం యీాయనవుసరంలేదు. జల్దీ దిగండి బాబూ. నాకు మల్లా రిటన్ టైం అవుతున్నది."

కృతజ్ఞత తెల్పుకుంటూ లారీ దిగాడు మోహన్. మోహన్ చేతుల్ని ఆసరా చేసుకొని రాజీ గూడా దిగింది. లారీ కదిలింది.

"గురువు పూర్తిగ సెడిపోయాడు" గొణుక్కున్నాడు క్లీనర్.

లోడు దింపుకొని ఆ సాయంత్రమే వెనుదిరిగిన లారీ కాబిన్‌లో రంగసామి కుడి ప్రక్కన ఉన్నదెవరో చూడండి; సాక్షాత్తూ లచ్చి. వస్తూ వస్తూ దారి మధ్యలోనే ఉన్న తన అత్తగారి ఊరువైపుకు లారీ మళ్ళించి మరీ లచ్చిని కాపురానికి తరలి రమ్మన్నాడు. రంగసామి వచ్చినందుకే పొంగిపోయిన లచ్చి, అతడే స్వయంగా ఆహ్వానించటం చూసి లచ్చి ఆనందంతో కన్నీరు కార్చింది. ఆకాశంలో తేలిపోయే మబ్బుల్లా ఆమె మనసులో సంబరాల తాలూకు ఊగిపోయే ప్రభలు.

"లచ్చీ ! ఎట్టున్నది ?" లచ్చి భుజంమీదగా తన కుడిచెయ్యి వేసి దగ్గరకు తీసికొంటూ అడిగాడు రంగసామి.

"ఏటి ?"

"ఈ లారీలో ... ఇట్టా ... మనిద్దరం ... "

రంగసామి మనసు నావరిస్తున్న అనుబంధాల తీయని స్మృతులు.

"గుండెంతా సంతోసంతో నిండిపోతంది మామా ! జల్మ జల్మలూ ఇట్టానే నీతో ఉండి పోనియ్యాల ఆ దేవుడు" రంగసామి భుజంమీద తల ఆన్చి అరమోడ్పు కన్నులతో అంది లచ్చి.

కాలం పొరల మాటున, కనురెప్పల కలల అలల క్రింద జీరాడే అంధకారాలు, వెన్నెలలు; వేడుకలు, నిట్టూర్పులు, కన్నీళ్ళు, నవ్వులు, వసంతాలు, ఎడగాడ్పులూ; ఇవ్వన్నీ ఈ అనంత జీవన యాత్రలో కలసి మనుగడ సాగించే భాగ స్వాములేమో; ఏ పరుసవేది స్పర్శకో ఎప్పుడైనా నోచు కొంటే ఇత్తడి పుత్తడైనట్లు విషమే అమృత మవుతుందేమో !









'ఏఎమా - ఫెంటాస్టిక్ సింఫొనీ' ఆస్ట్రియా చిత్రంలో ఒక దృశ్యం

అంతర్జాతీయ చలనచిత్రోత్సవాలు పోటీ చలన చిత్రోత్సవాలుగా ఒక సంవత్సరం ప్రబోధక చలన చిత్రోత్సవాలుగా ఒక సంవత్సరం మన దేశంలో 1975 నుంచీ నిర్వహింపబడుతూ వస్తున్నాయి కలకత్తాలో ఈ అంతర్జాతీయ చలనచిత్రోత్సవం ఏడేళ్ల వ్యవధి తర్వాత రెండవసారి నిర్వహింపబడుతోంది ఐతే, ఈసారి ప్రత్యేకతలు చాలావున్నాయి. గతంలో పూర్తిగా భారతప్రభుత్వం ఆధ్వర్యంలో నిర్వహింపబడుతున్న ఈ చలనచిత్రోత్సవాలు, ప్రప్రథమంగా నేషన్ ఫిలిం డెవలెప్ కార్పొరేషన్‌వారి పర్యవేక్షణలో నిర్వహింపబడుతున్నాయి ఇదివరకు ఎప్పుడూ జరగని 16 ఎం ఎం చలనచిత్రాల ప్రదర్శన విభాగం ఒకటి ఈసారి ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడింది భారతీయ టాకీచిత్రాల స్వర్ణోత్సవం సందర్భంగా నాటినుంచి నేటివరకు భారత చలన చిత్ర పరిశ్రమ పేరుతో ఓ ఛాయాచిత్ర ప్రదర్శన ఏర్పాటు చేయబడింది 11 విదేశీ రెట్రాస్పెక్టివ్ విభాగంలో టర్కీ దర్శకుడు ఇల్మజ్‌గునే, ఫ్రాన్సు దర్శకుడు జీన్‌లుక్‌గొడార్డ్, హంగరీ దర్శకుడు మిక్లాస్ జాన్‌స్కోల దర్శకత్వంలో రూపొందిన చిత్రాల ప్రదర్శన ఏర్పాటయింది

ఇండియన్ టాకీ స్వర్ణోత్సవాన్ని పురస్కరించుకుని 1920 30ల నాటి 20 భారతీయ, చలన చిత్రాలను ప్రదర్శనకు తెచ్చి చూపారు 'సినిమా – 2000' పేరున ఒక సెమినార్‌ను నిర్వహించి, రానున్న రెండుదశాబ్దాల ప్రభావంతో చలనచిత్ర రంగంలో రాగల మార్పులను అంచనా వేసేందుకు కృషి జరిగింది ఈ సెమినార్‌లో మృణాల్‌సేన్, ఆర్కె లక్ష్మణ్, డెరిక్ మాల్కొకు, పాట్రికా మొరాజ్ మొదలయినవారు పాల్గొన్నారు ఫిల్మోత్సవ్–82 సందర్భంగా ఓ ఫిలింమార్కెట్ కూడా ఏర్పాటు చేయబడింది



'బ్రదర్స్ అండ్ సిస్టర్స్' (యు.కె.) చిత్రంలో ఒక దృశ్యం

'ది మిర్రర్ క్రాక్డ్' ఆంగ్ల చిత్రంలో ఎలిజబెత్ టేలర్, ఎడ్వర్డ్ ఫాక్స్






# ఫిల్మోత

ఈ ఫిల్మోత్సవ్‌లో 37 దేశాలనుంచి ఎన్నిక చేయబడిన 87 చిత్రాలను జనవరి 3 నుంచి జనవరి 17 దాకా ప్రదర్శించి చూపడం జరిగింది ఈ ఫిల్మోత్సవ్ సందర్భంగా దాదాపు ఆరున్నరలక్షల వరకు ప్రదర్శనలద్వారా వసూలయింది విదేశీచిత్రాల్లో ప్రేక్షకులను ఎక్కువగా ఆకట్టుకొన్న చిత్రాలు 'విఆల్‌లవ్‌డ్‌హిమ్' [ఇటలీ–ఫ్రాన్స్], 'లవ్‌బిట్వీన్ డ్రాప్స్‌ఫ్‌రెయిన్' [జెకొస్లొవేకియా], ది ఇన్సిడెంట్ [జపాన్], ఫాదర్ అండ్ సన్ [హాంకాంగ్],పిక్చర్స్ [న్యూజిలాండ్], మెమోయర్స్ ఆఫ్ ఎ సర్వయివర్ [యు కె], లేడీ ఆస్కార్ [జపాన్, ఫ్రాన్స్], ఫ్రోజెన్ హార్ట్ [స్విట్జర్లండ్], ఇల్ మిన్‌స్ట్రోన్ [ఇటలీ], ది లాస్ట్ వే [స్పెన్], హాంకీ టాంకీ ఫ్రీవే [అమెరికా], ది పేరడైజ్ లాస్ట్ [బెల్జియం] హెయిర్ [అమెరికా], ది మిర్రర్ క్రాక్ట్[యు కె], ఫ్రమ్ ది అబిస్ [అర్జెంటైనా], స్ట్రాంగ్లింగ్ [జపాన్], మెఫెస్టో [హంగరీ – యఫ్ ఆర్ జి], బేడ్ టైమింగ్ [యు కె] ది యెల్లో హాండ్



బ్రెజిల్ చిత్రం 'లూసియో ఫ్లావియో'లో ఒక దృశ్యం



# వ్ - 82

కర్చీఫ్ [జపాన్], ఏనిమా ఫెంటాస్టిక్ సింఫొని [ఆస్ట్రియా], గ్లోయింగ్ ఆటమ్ [జపాన్] మొదలయినవి

కలకత్తాలో సినిమాల పట్ల, ముఖ్యంగా విదేశీ చిత్రాల పట్ల ప్రేక్షకులు ఎక్కువగా మోజు చూపే అలవాటుంది. ఇందుకు నిదర్శనంగా జీన్‌లుక్ గొడార్డ్ రెట్రాస్పెక్టివ్ చిత్రాలకు కౌంటర్ తెరిచి: గంట వ్యవధిలోనే సీజన్ టిక్కెట్లు అన్నీ అమ్ముడయిపోయాయి. ఫిల్మోత్సవ్ చిత్రాల ప్రదర్శనకు పనిచేసిన ఏడు థియేటర్లలోను సీజన్ టిక్కెట్లన్నీ పెద్దయెత్తున బ్లాక్‌లో అమ్ముడుపోయాయి. ది పారడైజ్ లాస్ట్, స్ట్రాంగ్లింగ్, ఏనిమా ఫెంటాస్టిక్ సింఫొని, పిక్పాకెట్, గ్లోయింగ్ ఆటమ్, మిల్కా, బేడ్ టైమింగ్ వంటి చిత్రాల్లో మసాలా సీన్లు మస్తుగావున్నాయని ప్రచారం వచ్చిన కారణంగా రు. 5/—ల టిక్కెట్లు దాదాపు రు. 200/—ల దాకా అమ్ముడుపోయింది.

ఒకటి రెండు చిన్న చిన్న పొరబాట్లు తప్పితే గతంలో ఢిల్లీ, బెంగుళూరుల్లో జరిగినంత అల్లర్లు, అలజడులు లేకుండా కలకత్తా ఫిల్మోత్సవ్ – '82 జనవరి 17న ప్రశాంతంగానే ముగిసింది.

— శంతను

## 'సుబ్బారావుకి కోపం వచ్చింది'

కలకత్తాలో జరుగుతున్న ఫిల్మోత్సవ్–82 సందర్భంగా నిర్వహించబడుతున్న ఫిలింమార్కెట్‌లో తెలుగుచిత్రం 'సుబ్బారావుకి కోపం వచ్చింది' పాల్గొంది. ఫిల్మోత్సవ్‌కి హాజరయిన విదేశీ ప్రతినిధులతోబాటు పత్రికలవారికి ఈ చిత్రాన్ని జనవరి–11వ తేదీన గోర్కీ సదన్‌లో ప్రదర్శించి చూపారు. ఈనాటి సామాజిక వ్యవస్థలో, ఓ సగటుమనిషి ఉదయాస్తమానం ఎదుర్కొంటూ వస్తున్న సమస్యల సంఘర్షణను ఇతివృత్తంగా తీసుకుని నిర్మించబడిన ఈ వర్ణచిత్రం పట్ల ఆస్ట్రేలియా దేశం ఆసక్తి కనబరచినట్లు, వారు ఈ చిత్రం కొనుగోలు చేయడానికి సంబంధించిన సంప్రదింపులు కొనసాగుతున్నట్లు చిత్రనిర్మాతలు తెలియజేసారు. దర్శకుడు ధవళసత్యం రూపొందించిన ఈ చిత్రంలో నారాయణరావు, నూతన తార మేనక, పి. యల్. నారాయణ, రోహిణి మొదలయినవారు నటించారు. పూర్తిగా విజయవాడ పరిసరప్రాంతాల్లో నిర్మించబడిన ఈ చిత్రం తెలుగుప్రేక్షకులను బాగా 'ఆకట్టుకోగలదని ఆశించవచ్చు. శాయికృష్ణ ఫిలింస్‌ద్వారా ఆంధ్రలోను, నవయుగ ఫిక్చర్స్ ద్వారా రాయలసీమలోను ఫిబ్రవరిలో విడుదల కాగలదని తెలుస్తోంది.

'సుబ్బారావుకి కోపం వచ్చింది'లో నారాయణరావు, మేనక



జపాన్ చిత్రం 'గ్లోయింగ్ ఆటమ్'లో ఒక సన్నివేశం





# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## మల్లె పందిరిలో ప్రేమ గురువు !

ఒక పెద్ద బంగాళా టాప్‌మీద అద్దె లేకుండా ఉచితంగా బసచేసి ఉన్న గురువు (వేటూరి సుందరరామమూర్తి) వద్దకు వెంకు (విజ్జిబాబు)ను తీసుకొచ్చాడు శంకర్ (జిత్ మోహన్ మిత్రా)

"నమస్తే గురువుగారూ !"

"ఖుషీభవ !" అని ఆశీర్వదించాడు గురువు

"క్షమించాలి ఇతను –"

"వెంకట్రావో, అప్పారావో అయి ఉంటాడు"

వెంకు విస్తుపోయాడు "తమరెలా పసిగట్టారు, స్వామీ ?"

"నీ ఫేస్ చూసి, నాయనా ! ఈ మొహానికి నవీన్ అనో, కళ్యాణ్ అనో పేరుండడానికి వీల్లేదు కాక వీల్లేదు"

శంకర్ అందుకున్నాడు "గురూగారూ ! మా వాడికి 35 ఏళ్ళు దాటినా – ఒక్క సంబంధం కూడా రావడంలేదు అంచేత, మా వాడు ఎలాగైనా, ఏ పిల్లనైనా సరే – ప్రేమించి, ప్రేమించబడాలన్న నిర్ణయం తీసుకున్నాడు స్వతహాగ భయస్థుడు తమరు ప్రేమ మంత్రోపదేశం చేస్తే, ధైర్యం తెచ్చుకుని, ఒక ఊపు ఊపుతాడు"

గురువు గంభీరంగా "ప్రేమించడం, పనసకాయ కూర వండటం -రెండూ ఒక్కలాంటివి, నాయనా ! రెంటికీ కాస్త ఓర్పు, నేర్పు కావాలి ప్రేమకి ముఖ్యావసరం ఓ ఆడపిల్ల ముందుగా ఓ చక్కని చుక్కను ఎంచుకో ఆ పిల్లకి కాస్త దూరంగా నిలబడి – అంటే, చెప్పు విసిరితే తగలనంత దూరంలో నిలబడి, 'నవమినాటి వెన్నెల నేను. దశమినాటి జాబిలి నీవు కలుసుకున్న ప్రతి రేయీ కార్తీక పున్నమి రేయీ' అన్న టైప్‌లో కూనిరాగాలు తియ్యి అంతేగాని, 'చిలక కొట్టుడు కొడితే చిన్నదానా – పలకమారిపోతావే పడుచుదానా' ఇటువంటి పాటలు పాడవంటే మాత్రం – ఒళ్ళు పనసపొట్టయిపోతుంది జాగ్రత్త ! సెకండ్ పాయింట్: ఆ పిల్లకి ఏ వస్తువంటే ఇష్టమో ఆ వస్తువు నీకు చచ్చేంత ఇష్టమున్నట్లు నువ్వు నటించాలి. ఉదాహరణకి – ఆ పిల్లకి అంబాజీపేట వంట ఆముదం అంటే చచ్చే ఇష్టమనుకో అది నీకు అంతకన్నా ఇష్టమైనట్లు గ్లాసుడు గడగడ తాగెయ్యాలి ఇటువంటి ప్రేమ సూత్రాలు కొన్ని వందలు వేలు ఉన్నాయి నాయినా నా బుర్రలో– వారు కటాక్షించినవి"

"ఎవరు స్వామీ ! వారు ?" అని వెంకు కుతూహలంతో ప్రశ్నించాడు

"వారు దిగ్దిగంత దరిద్ర నారాయణస్వాములని– అస్మద్ గురుదేవులు మన్మథ పీఠాధిపతులు," అన్నాడు గురువు ఆముదం తాగినవాడిలా ముఖం పెట్టి

"పాపం ! అలా ఉన్నారేంటి, స్వామీ ?"

"అదో పెద్ద కథ, నాయనా ! వారు మనసిచ్చిన ఆడపిల్ల – వారి అమాయక శిష్యుడ్ని లేవదీసుకుపోవడంతో, వారు దిక్కులు చూస్తూ అలా ఉండిపోయినారు – దిక్కుమాలిన స్వాముల వారు"

"అయ్యో, పాపం !" అనుకున్నాడు వెంకు

రచయిత జంధ్యాల దర్శకత్వం వహించిన కాంతి ఫిలిమ్స్ "మల్లె పందిరి" చిత్రానికి చల్లా వెంకట్రామయ్య నిర్మాత

'ఇంట్లో రామయ్య – వీధిలో కృష్ణయ్య'లో ఒక దృశ్యం





'బాబులుగాడి దెబ్బ'లో జ్యోతిలక్ష్మి

## విశ్వచిత్ర సినీఎంటర్‌ప్రైజెస్

"తొలి షెడ్యూల్ ఫిబ్రవరి 1నుంచి 10 వరకు ఉంటుంది," అన్నారు డైరెక్టర్ ఎ. కోదండ రామిరెడ్డి. "టాక్సీడ్రయివర్" అనంతరం కృష్ణంరాజుతో జి. రామకృష్ణంరాజు నిర్మించే ఈ ద్వితీయ చిత్రంలో జయప్రద, మోహన్‌బాబు, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య ఆదిగా గల వారుంటారు. దాసరి కథకుడు. సత్యానంద్ సంభాషణల కర్త. వేటూరి గీతాలకు చక్రవర్తి స్వరకల్పన చేస్తారు. నవకాంత్ ఛాయ, కుదరవల్లి నాగేశ్వర రావు శిల్పం, డి. వెంకటరత్నం కూర్పు నిర్వహిస్తారు.

దేశం మీద కోపమా? సమాజం మీద కోపమా?

భూస్వాముల దాడి

ప్రమాదంలో ముగ్గురి మృతి

ముగ్గురి మృతి

జీడికల్లులో పోలీసుల దౌర్జన్యకాండ:

రికార్డు స్థాయికి ధరల పెరుగుదల

యుద్ధ పోటీ - ఆకలి లోకం




దూండీ సమర్పించు

పి.శ్రీనివాసరావు,సన్స్

# సుబ్బారావుకి కోపం వచ్చింది

ఈస్ట్మన్ కలర్

నిర్మాత: పి.జి.బెనర్జీ సహనిర్మాత: పి.ప్రేమ్‌కుమార్ నిర్వహణ: పి.బాబ్జీ

స్క్రీన్‌ప్లే-పాటలు-దర్శకత్వం: ధవళ సత్యం



# సినిమా

## నిప్పుతో చెలగాటంలో గోడౌన్‌లో గందరగోళం

గోడౌన్ ముందు జగపతి (రావు గోపాలరావు), గజపతి (అల్లు రామలింగయ్య) ఉషారుగా ఉన్నారు

"ఒరేయ్, జగం! ఆ సెక్రెట్రీ ధర్మమాంటూ నేపాల్ రాణీ మన సరుకంతా కొనేస్తే .."

"ఏడుకొండలస్వామిని దర్శించుకుని, నీకు గుండు కొట్టిస్తాను"

"నీ బుర్ర బద్దలుగానూ — మన పని పూర్తవ్వాలేగాని, నెల రోజులు తిరపతిలోనే ఉండి, రోజుకొకసారి గుండు కొట్టించుకుంటాను గంటకోసారి నామాలు పెట్టించుకుంటాను అదిసరేగాని, ఆ సెక్రెట్రీగాడు వచ్చేలోగా మన సరుకు ఒక్కసారి కళ్ళారా చూసుకుందాం తలుపు తియ్యి"

తలుపు తెరిచాక ఇద్దరూ లోనికి అడుగెట్టి, ఖాళీ గోడౌన్ చూసి గతుక్కుమన్నారు

"ఒరేయ్, గజం!"

"కొంప మునిగిందిరా, జగం!"

"ఖాళీ గోడౌన్ చూసి కాళ్ళు చేతులు ఆడటం లేదు తిరపతికి వెళ్ళకుండానే మనకి గుండు కొట్టార్రా ఎవరో! ఎవరు? ఎవరు చేశారీపని?"

అందుకు చాటునుంచి మరో కంఠం జవాబిచ్చింది "నక్కజిత్తులు మాని, లక్షలు విలువచేసే సరుకు ఎక్కడ దాచిపెట్టారో చెప్పండి!" మరో క్షణంలో వాళ్ళ ఎదుట రవి (శరత్‌బాబు) తారసిల్లాడు




జగపతి కళ్ళు నలుముకుని చూశాడు "హమ్మ! అణాకానీ నాయాలా! నా సరుకు గల్లంతుచేసి, నన్నే నిలదీస్తున్నావా?"

"మర్యాదగా దాచింది ఎక్కడో చెప్తారా లేదా?"

"కబుర్లు చెప్పకు కడుపులో దిగిపోద్ది కత్తి... భీకూ! జగ్గూ! ఖాదర్!" అంటూ జగపతి కేకలెట్టాడు మెరుపులా ముగ్గురు ఆజానుబాహులు వచ్చి రవిమీద పడ్డారు హోరాహోరీ పోరాటం జరిగింది. చివరికి రవిని ఆ ముగ్గురు బంధించారు

"వీడిని కట్టిపడేసి, నిజం చెప్పేవరకు చితక బాదండి!" అంటూ జగపతి రీవిగా గజపతివంక తిరిగాడు.

షాట్ ఓకే అయ్యాక "రవిని మోహన్ రక్షిస్తాడు. మోహన్ పాత్రధారి కృష్ణంరాజు ఆయన మరో పాత్రను కూడా ధరిస్తున్నారు," అన్నారు రవిచిత్ర ఫిలిమ్స్ "నిప్పుతో చెలగాటం" చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలను వహించే కొమ్మినేని. వై. వి రావ్ నిర్మించే ఈ చిత్రంలో విజయచందర్, కాంతారావు, సారథి, ముక్కామల, బాలకృష్ణ, పెమ్మసాని రామకృష్ణ, జయసుధ, శారద, కవిత, గీత, విజయలలిత, బేబీ వరలక్ష్మి ఇతర పాత్రధారులు గొల్లపూడి, సత్యం, సి నారాయణరెడ్డి, వేటూరి, గోపి, పి దేవరాజ్, హీరాలాల్, డి రాజగోపాల్, బి చలం, మాధవన్, కత్తుల గోపాలకృష్ణ, ఎస్ రామకృష్ణ, పి. దిలీప్ కుమార్, వి సుందరం, పి రఘురాం, ఆర్.పి మణి తెరవెనుక కృషి చేస్తున్నారు.

* * *



'కీర్తి కాంత కనకం'లో మంగళగౌరి, రంగా



'ఈశ్వరుడు—శనీశ్వరుడు'లో జయంతి

# సినిమా



'మిస్టర్ విజయ్'లో రాధ, శోభన్‌బాబు

## "ప్రేమ విజయం"

పల్నాడు ఆర్ట్ మూవీస్ వారి పై చిత్రం తొలి షెడ్యూల్ గురజాల, జంగమహేశ్వరపురం, కారంపూడి వగైరా చోట్ల జరిగింది. రెండవ షెడ్యూల్ ఫిబ్రవరిలో ఉంటుంది. ఇందులో డి. నాగేశ్వరరావు, సుశీల, శివరాంసింగ్, స్వప్నప్రియ, శ్రీకృష్ణ, దేవిశ్రీ వగైరా నూతన నటవర్గం. కె. వి. ఎస్. ప్రసాద్ మాటలు, పాటలు రాశారు. ఎన్. ఎస్. ప్రకాశ్ సంగీతానికి ఎన్.రాజేశ్వరరావు పర్యవేక్షకుడు. కిషన్‌సాగర్ ఛాయ, పసుమర్తి నృత్యం, జి. బాబ్జీ శిల్పం, సువర్ణకుమార్ సహాయ దర్శకత్వం, రామమోహనరావు కూర్పుతో మామిళ్ళ చిన నారాయణరావు సమర్పించే ఈ చిత్రానికి ఎస్. టి. లాల్, మామిళ్ళ సత్యనారాయణ నిర్మాతలు. ప్రొడక్షన్ కంట్రోలర్: వేముల సైదయ్య చౌదరి. నిర్వహణ: యతిరాజా సాంబశివరావు. కథ,దర్శకత్వం: నందూరి సూరిబాబు.

## ఇకనైనా మారండి

"డిసెంబర్ 6నుంచి 31 వరకు మద్రాసులోనే షూట్ చేశాం. సంక్రాంతి తర్వాత భద్రాచలం, సింహాచలం, అన్నవరం ప్రాంతాలలో ఆరు రోజుల పాటు షూటింగ్‌తో పూర్తవుతుంది," అన్నారు డైరెక్టర్ గంగాధర్. బి. బాబ్జీ సమర్పించే ఈశ్వరీ ఆర్ట్ పిక్చర్స్ "ఇకనైనా మారండి"లో మురళిమోహన్, జ్యోతి, గుమ్మడి, అల్లురామలింగయ్య, రాళ్ళపల్లి, సాక్షిరంగారావు, వల్లం నరసింహారావు, రావికొండలరావు, మనోరమ, అత్తిలిలక్ష్మి, కాకినాడ శ్యామల, పద్మ నటిస్తున్నారు. బి. సత్యనారాయణ సింగ్ నిర్మించే ఈ చిత్రానికి నైవేలి లిగ్నైట్ కార్పొరేషన్‌లో మెకానికల్ ప్రొడక్షన్ శాఖ ప్లాంట్ మేనేజర్ ఎం. డి. జయరావ్ కథ రాశారు. ఆత్రేయ సంభాషణలకర్త. సత్యం స్వరకల్పనలో ఆత్రేయ, వేటూరి గీతాలు రాశారు. వి. సుబ్బారావు, కె. రామలింగేశ్వరరావు, కె. ఎస్. రామకృష్ణ, ఎం. ఎస్. మణి, ఎస్. వెంకటేశ్వరరావు ఇతర సాంకేతిక నిపుణులు. "విధి చేతిలో కీలుబొమ్మగా చిక్కిన ఓ వనితగాథ," అన్నారు స్క్రీన్‌ప్లే రాసి, నిర్వహణ బాధ్యతలు వహించే తురయూర్ కె. మూర్తి.

## "తొలిపొద్దు"

అభినయ ఆర్ట్ క్రియేషన్స్ "వంశగౌరవం" విడుదలకు సిద్ధంగా ఉంది. తదుపరి చిత్రం "తొలిపొద్దు"ను జన చైతన్య క్రియేషన్స్ పతాకంలో జాగర్లమూడి ఆదినారాయణరావు, రావి ఆంజనేయులు నిర్మిస్తారు. దీనికి కూడా చక్రవర్తి సంగీతం, వెంకట్ ఛాయతో ఎస్. రవీంద్రరెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వం బాధ్యతలు వహిస్తారు. ఏలూరి దుర్గాప్రసాద్ సమర్పణ. మార్చిలో ఔట్‌డోర్‌తో చిత్రీకరణ మొదలై ఒకే షెడ్యూల్లో ముగుస్తుంది.

'బంగారు కానుక'లో సుజాత



## డైరెక్టర్ పి. వి. రాజు చిత్రాలు

భీమేశ్వరా ఆర్ట్ మూవీస్ "ప్రేమజ్వాల" చిత్రం నవంబర్ 27న విశాఖపట్నంలో ప్రారంభమై, డిసెంబర్ 21కి పూర్తయింది. తలాటం మాణిక్యాంబ సమర్పించే ఈ చిత్రంలో నూతన్‌ప్రసాద్, రాజ్‌బాబు, త్యాగరాజు, గోకిన రామారావు, హేమసుందర్, సారథి, చిట్టిబాబు, సాక్షి రంగారావు, రాళ్ళపల్లి కొత్త నాయకా నాయికలు కమలాకర్, విజేత పాల్గొన్నారు. వేటూరి, రాజశ్రీ గీతాలకు చక్రవర్తి సంగీతమిచ్చారు. పార్థసారథి ఛాయ, కణ్ణన్ కూర్పులతో తలాటం వెంకటేశ్వరరావు నిర్మాత.

ఫిబ్రవరి నుంచి ద్రాక్షారామం, కోటిపల్లి, యానాం ప్రాంతాల్లో ఒకే షెడ్యూల్‌లో విశాఖపట్నం వాస్తవ్యులు ఆర్. వి. వి. సత్యనారాయణ, సి.హెచ్.

'నిప్పుతో చెలగాటం'లో కవిత శరత్‌బాబు



పెద్దేశ్వరరావు నిర్మించే డాల్ఫిన్ ప్రొడక్షన్స్ తొలి చిత్రానికి వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పం నిర్వహిస్తారు.

పై రెండు చిత్రాలకూ పి. వి. రాజు కథ, స్క్రీన్‌ప్లే కూడా సమకూర్చారు.

## "జై సంతోషిమా"

ఉత్తర భారతంలో ప్రేక్షకులను తన్మయుల్ని గావించిన పై పౌరాణిక చిత్రాన్ని చూడామణి కంబైన్స్ అధినేత కె. గోపాలచూడామణి తెలుగులో రూపొందిస్తున్నారు. అనితాగుహా, ఆషిష్ కుమార్, కానన్ కౌశల్, భరత్ భూషణ్, రజనీబాల, బేలాబోస్, లీలామిశ్రా, కుందన్ మల్లిక్, మహీపాల్ పాల్గొన్నారు. రాజశ్రీ మాటలు, పాటలు రాశారు. సి. అర్జున్, ఎ. ఎ. రాజా సంగీతం, సుధేందు రాయ్ ఛాయ,సీను కూర్పు, విజయశర్మ దర్శకత్వంతో కె. రంగబాబు నిర్మాణ బాధ్యతలు వహిస్తున్నారు.

# సినిమా

## డైరెక్టర్ కొమ్మినేని శేషగిరిరావు చిత్రాలు

రవి చిత్ర ఫిలిమ్స్ వై. వి. రావ్ నిర్మించే ''నిప్పుతో చెలగాటం'' మార్చిలో విడుదలవుతుంది. నవభారత్ బాబూరావు నిర్మించే జి. వి. కె. పిక్చర్స్ ''పెళ్ళిళ్ళ పేరయ్య'' చిత్రం ఫిబ్రవరి 15 నుంచి మార్చి 10 వరకూ గుంతకల్లు ప్రాంతాలలో ఒకే షెడ్యూల్‌లో చిత్రీకరణ పూర్తవుతుంది. శోభన్ బాబు ద్విపాత్రాభినయంతో దోనపల్లి బాబూరావు, భద్రయ్య నిర్మించే చిత్రం ఉగాదినాడు సెట్స్‌కు వెళ్తుంది. ఇందులో శారద, రావు గోపాలరావు ఇతర ముఖ్య పాత్రధారులు. చక్రవర్తి సంగీత దర్శకుడు. శాయికృష్ణా ఎంటర్‌ప్రైజెస్ పతాకంలో రూపొందే ఈ చిత్రం పేరు ''రఘు రాముడు''. కృష్ణతో ''రౌడీ మామూలు'' చిత్రం ఆగస్ట్‌లో మొదలవుతుంది. రవి చిత్ర ఫిలిమ్స్ కొత్త చిత్రం జూలైలో సెట్స్‌కు వెళ్తుంది.

## ''దొంగలొస్తున్నారు జాగ్రత్త''

''సెంటిమెంట్ ఉన్న క్రైమ్ థ్రిల్లర్,'' అన్నారు వై. కన్నయ్య. ఈయన సమర్పించే రమణ ఆర్ట్స్ ఫిలిమ్స్ వారి పై చిత్రంలో సరిత, కె. ఆర్. విజయ, సుమన్, వనిత, రవీంద్ర పాత్రధారులు. కరాటే వీరుడు మణి కూడా ఓ కీలక పాత్రను ధరించాడు. వసంతకుమార్ రచన, శంకర్ – గణేశ్ సంగీతం, ఆర్. త్యాగరాజన్ దర్శకత్వంతో వై. రమణమ్మ నిర్మాత.

## శ్రీ విజయి ఆర్ట్ పిక్చర్స్

''పూర్తిగా కొత్తవాళ్ళతోనే తీస్తాం,''అన్నారు రాజ్‌భరత్. ఈయన దర్శకత్వంలో ఫి. సతీష్ నిర్మించే చిత్రానికి రాజశ్రీ మాటలు, పాటలు రాశారు. శంకర్–గణేశ్ సంగీతం, ఆర్. కె. తివారి ఛాయతో బోసు నిర్వహణ బాధ్యతలు వహిస్తారు.

## చరిత చిత్ర ఇతర చిత్రాలు

మార్చిలో సెట్స్‌కు వెళ్లే చరిత చిత్ర కంబైన్స్ ''మాయగాడు''లో శోభన్‌బాబు హీరో. వి. మధుసూదనరావు దర్శకుడు. చక్రవర్తి సంగీతం, గోపాలరెడ్డి ఛాయతో తమ్మారెడ్డి వి. కె. నిర్మాత.

ఆగస్ట్‌లో చరిత చిత్ర మొదలెట్టే ''ముగ్గురూ మొనగాళ్ళే'' చిత్రంలో కృష్ణ, జయప్రద, మరో ఇద్దరు హీరోలు ఉంటారు. ఈ చిత్రం ద్వారా కొత్త దర్శకుడు ప్రసాద్ పరిచయమవుతారు.

## ఉన్నత హోదాల్లో కన్నడ తారలు

కర్నాటక ప్రభుత్వ ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స్ ఛైర్మన్‌గా నటి భారతి, కర్నాటక ఫిలిమ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ ఛైర్మన్‌గా మాజీ నటి బి. సరోజాదేవి నియుక్తులై ఉన్నారు. నెలసరి ప్రతిఫలం రూ. 2,500. బంట్రోతులు, టెలిఫోన్, కారు సదుపాయాలు వీరికి మంత్రులతో సమానంగా ఏర్పాటు చేయబడ్డాయట.



'గృహ ప్రవేశం'లో జయసుధ, మోహన్‌బాబు

## ఇరుగు - పొరుగు

★ రాజ్‌ఖోస్లా దర్శకత్వంలో అమర్‌జిత్ నిర్మించే చిత్రంలో ధర్మేంద్రతోపాటు అతని కొడుకు సన్నీదియోల్ నటిస్తున్నాడు.

★ అశోక్‌కుమార్ మనమరాలు అనూరాధ ''అహెన్'' అనే చిత్రంలో నాయికగా తొలిసారిగా కెమెరా ముందు నటించబోతోంది.

★ శివాజీగణేశన్ కుమారుడు ప్రభు ''శంగిలి'' అనే తమిళ చిత్రంలో విలన్‌గా వెండితెరకు పరిచయమవుతున్నాడు. ఇటీవలే రెండు చిత్రాల్లో హీరోగానూ బుక్ అయ్యాడు.

★ నటి రీనారాయ్ చిత్రానికి దాసరి నారాయణరావు దర్శకత్వం వహించబోతున్నారు.

★ ప్రసాద్ ప్రొడక్షన్స్ సంస్థ పై ఒక హాస్య చిత్రాన్ని తయారుచేసే బాధ్యత సుప్రసిద్ధ డాకుమెంటరీ చిత్ర నిర్మాత హరి ఆత్మకు అప్పగించబడింది.

★ కలకత్తాలో దాదాపు ప్రతి సినిమా థియేటర్‌లోనూ 'బార్'లు ఉన్నాయి.

★ పద్మాలయ ఫిలిమ్స్ హిందీ ''మోసగాళ్ళకు మోసగాడు'' చిత్రం మల్టీ స్టారర్ జితేంద్ర, ఋషికపూర్, శక్తికపూర్, రంజిత్, కాదర్‌ఖాన్ ఆదిగాగల వారుంటారు. ఈ చిత్రానికి ''మేరీ అవాజ్ సునో'' చిత్రం ద్వారా ఖ్యాతి నార్జించిన రాజేంద్రసింగ్ దర్శకుడు. ఇతని కోసం బొంబాయి చిత్ర నిర్మాతలు ఎగబడుతున్నారట.

★ ధర్మేంద్ర ఇటీవల ''ఖుదా కసమ్, నాచ్ని జవానీ (పంజాబీ)'' అనే రెండు చిత్రాలలో గెస్ట్‌గా నటించాడు. ''తాజుర్బా'' అనే చిత్రానికి కామెంటరీ చెప్పాడు.

★ ఒక నిర్మాత తనకు నటీనటులు ఇచ్చిన సంపూర్ణ సహకారానికి కృతజ్ఞతలుగా ఆ చిత్రాన్ని ఆ తారలకే సమర్పిస్తున్నట్లు టైటిల్స్‌లో వేయదలచాడు. ఎం. మరూఫ్ ఆ నిర్మాత. ''మొహబత్‌కా బాసిహ'' చిత్రాన్ని విజయేంద్ర, సచిన్, నీతు మెహ్తా, కాదర్‌ఖాన్, ఓం శివపురి, శక్తికపూర్‌లు సమర్పిస్తున్నట్లు పబ్లిసిటీ కూడా చేయబోతున్నాడు.

## నమోదు చేయబడిన కొత్త చిత్రాల పేర్లు

శ్రీ బసవపూర్ణపిక్చర్స్ ''బెజవాడ భద్రయ్య, న్యాయానికి విడాకులు'', రాధికా ఆర్ట్ పిక్చర్స్ ''దూరపు కొండలు'', జీసస్ ఫిలిమ్స్ ''ప్రేమకు మరణంలేదు, దేవదాసి'', మయూర ఎంటర్‌ప్రైజెస్ ''ఆమె జీవితం'', శ్రీ తిరుమల ఆర్ట్ ఫిలిమ్స్ ''ఆమె చేతి చలవ'', భార్గవ విరల్ కంబైన్స్ ''గణేశ్ మహిమ'', శ్రీ కోదండరామ కంబైన్స్ ''హరి దర్శనం'', ఎం. ఎ. ఎస్. కంబైన్స్ ''జయమాలిని'', కల్యాణ్ సంజయ్ ఇంటర్నేషనల్ ''మాలపిల్ల – మనమరాళ్ళు'', శ్రీ కృష్ణా ఆర్ట్ ఫిలిమ్స్ ''మహారాజశ్రీ మామయ్యగారికి'', వంశీ కృష్ణా సినీ కంబైన్స్ ''మహా నగరంలో మాయా జాలం'', గోపీ మూవీస్ ''మందువా లోగిలి'', శ్రీ రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ ''ప్రేమదీపం, ప్రేమ పోరాటం'', సప్తగిరీశ్వర ఆర్ట్ క్రియేషన్స్ ''సన్నీటి బుడగలు'', కోటగిరి ఫిలిమ్స్ ''తోడల్లుళ్ళు'', శ్రీ భగవతీ ఆర్ట్ క్రియేషన్స్ ''వేశ్య'', కిరణ్ చిత్ర ''తెల్లచీర మల్లెపూలు''. 






# సంపూర్ణ పోషకాహారంలో వుండవలసినవన్నీ కలిసివున్న రుచికరమైన పదార్థం

# సిరిలాక్®

## ఇన్‌స్టెంట్ వీట్ మిల్క్ సీరియల్

దీనిని తయారు చేయడం చాలా సులభం —దీనితో ముందుగా మరగబెట్టిన గోరువెచ్చని నీరు చేర్చండి



ముందుగా మరగబెట్టిన నీటితో సెరిలాక్ చేర్చండి



బాగా కలపండి



వెంటనే యిచ్చేందుకు తయారు

ఇవ్వగలిగినంత కాలం మీ పాపకి చనుపాలు యివ్వండి—మీరు యివ్వగలిగిన మంచి ఆహారం అదే. 4 నెలల ప్రాయం వచ్చేసరికి పాపకి ఎక్కువగా పోషక పదార్థాలు కావాలి. ఘన పదార్థాలు తీసుకోడానికి పాప సిద్ధంగా వుంటుంది. సిరిలాక్ యివ్వడం వలన, పాలు యివ్వడం మానకుండా పాప ఆహారంలో ఘన పదార్థాలు ప్రవేశ పెట్టడం గురించి మీ డాక్టర్‌ని సంప్రదించండి.

మీ పాపకి సరిఅయిన పాళ్లలో పోషక పదార్థాలు అందించడానికి సిరిలాక్‌లో గోధుమ పిండి, పూర్తి మీగడ పాలు మరియు చక్కెర ఉన్నాయి. పిండి పదార్థాలు మరియు క్రొవ్వు పదార్థాలు శక్తి నివ్వడానికి, మాంసకృత్తులు పెరుగుదలకి, విటమిన్లు మరియు ఖనిజాల లోపాల నుండి రక్షణ కలిగించడానికి దీనిలో ఉన్నాయి. సిరిలాక్—మీ పాప బాగుగా, ఆరోగ్యంగా పెరగడానికి.

**సిరిలాక్**–పాలు వుండనే వున్నాయి

SAA/FSL/C/2258 TEL

NESTLÉ

సీరియల్

# జీవిత వనంలో కొత్తగాలి

కుందుర్తి ఇందిరాదేవి

(గత సంచిక తరువాయి)

**జరిగిన కథ - 15 :** కుటుంబ భారం తనపై వేసి తండ్రి కన్నుమూయగా, సంధ్య ఓ చిన్న ఉద్యోగం చేస్తూ తల్లితో పాటుగా తమ్ముణ్ణీ, ముగ్గురు చెల్లెళ్లను పోషిస్తూ వాళ్లకి చదువు సంధ్యలు చెప్పిస్తుంటుంది. ప్రమీల అన్న కిరణ్‌తో సంధ్య స్నేహం చిగుళ్ళు తొడుగుతుంది. శశి చదువు పూర్తయి ఉద్యోగంలో చేరగానే ఆమెకు ఆ ఇంటి బాధ్యత అప్పగించి సంధ్యా, కిరణ్‌లు పెళ్లి చేసుకొని తామూ సహాయపడాలని నిశ్చయించుకొంటారు. ఉద్యోగంలో చేరి ఆ ఇంటికి ఆధారం అవుతుందనుకొన్న శశి, ప్రకాష్‌ని పెళ్లి చేసుకొని వెళ్లిపోవడంతో, దిక్కు తోచని పక్షిలా విలవిలలాడిపోతుంది సంధ్య. శశికి ఉద్యోగం వస్తే, తన అత్తగారికి ఇష్టం లేకపోవడంతో చేయనని ఖచ్చితంగా చెప్పేసి వెళ్లిపోతుంది. కిరణ్‌కి బొంబాయి ట్రాన్స్‌ఫర్ అవడంతో మరీ కృంగిపోతుంది సంధ్య సంధ్యా కిరణ్‌లు పెళ్లి చేసుకోవడం ఇరు కుటుంబాలకూ ఇష్టంలేదు. కిరణ్ వివాహ ఆహ్వాన శుభలేక అందుకొని మూర్ఛపోతుంది సంధ్య. కమలతో కిరణ్ వివాహం జరగటం, ఓ మగపిల్లవాణ్ని ప్రసవించి కమల చనిపోవడం, కొడుకును సుగుణ కప్పగించి కిరణ్ పారిస్ వెళ్లిపోవడం వెంటవెంటనే జరిగిపోతాయి. సంధ్య జీవితం మామూలే. ఈలోగా ఉష తమ కులం కానివాణ్ని ప్రేమించి 'నువ్వు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా అతన్నే పెళ్లి చేసుకుతీరతాన'ని సంధ్య మొహంమీదే చెప్పేస్తుంది. కలవారి అమ్మాయి రాణిని చేసుకుని ఇల్లరికం వెళ్తాడు తమ్ముడు ఫల్గుణ.

## 33

"శశి ఉత్తరం వ్రాసింది" అంది అమ్మ కాఫీ ఇస్తూ.

"ఏమిటట విశేషాలు" అన్నాను ఉత్తరం ఎవతల పెట్టేస్తూ.

"పిల్లలతో చేసుకోడం కష్టంగా ఉందిట నానుని ఇక్కడికి పంపిస్తాను" అంది.

నేను మాట్లాడలేదు. శశికి ఉండే ఆత్మాభిమానం అంతా ఏమయిపోయిందో? ఎంతసేపు ఇరుగుపొరుగూతో పందెం వేసుకుంటుంది. ఛీ! ఎంత సిగ్గులేకుండా అయిపోయింది అనుకున్నాను.

మర్నాడు ఆఫీసుకి వెళ్ళేటప్పుడు మళ్ళీ కదిలించింది.

"నీకూ ఒంట్లో బాగుండటంలేదు. వాడిని ఎవరు చూస్తారు?" అన్నాను సాధ్యమైనంత సౌమ్యంగా

అమ్మ ఉత్సాహంగా అంది "మీరంతా బయటకి వెడతారు మధ్యాహ్నం నాకు ఒక్కదానికీ ఏమీ తోచదు కాస్త సందడిగా అన్నా ఉంటుంది."

"కానీ నీకు విశ్రాంతి అవసరం అని చెప్పాడు కదమ్మా నీ కొడుకు."

"నీకు పనేమీ లేదుగా! ఉదయం, సాయంత్రం నువ్వు చూడు" అంది. నేను భగ్గుమన్నాను "నాకంత ఖర్మ ఏం పట్టలేదు."

"సంధ్యా" అమ్మ నివ్వెరపోయింది.

"నవమాసాలు మోసి కన్న ఆవిడగారే చేసుకోలేనప్పుడు, పరాయమ్మ కన్నబిడ్డని ఇంకెవరో ఎందుకు చూస్తారు" అన్నాను విసురుగా.

"శశి... నీకు పరాయిదా!"

"అని పదే... పదే నాచేత పలికించద్దు"

"పోనీ నేనే చూసుకుంటాను. పిలిపించు."

"నో! డబ్బు పారేస్తే ఆయాలు దొరుకుతారు మనకన్నా శుభ్రంగా, పువ్వుల్లా పెంచుతారు వాళ్ళు. అప్పుడిహ ఈవిడ ఏ మహిళా సంఘాలు పట్టుకుని తిరిగినా దిగుల్లేదు. వీళ్ళందరికి, వీళ్ళకి పుట్టే సంతానానికీ చెయ్యడానికి ఇక్కడ పనివ మనుషులెవరూ లేరు" అన్నాను నిర్లక్ష్యంగా వెళ్ళబోతూ.

"వాడిని నీ ఛాయలకికూడా రానివ్వను. వాడిని నేనే పెంచుతాను" అమ్మ బతిమిలాడుతూ అంది ఆ వయసులో ఆ మమకారం అలా ఉంటుందేమో

"నీ తాలూకు సొమ్మేమైనా ఉంటే అలాగే ఖర్చుపెట్టుకో" అని గుమ్మందాకా వచ్చాను.

అమ్మ మండిపడుతూ "నువ్వు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా నేను శశి కొడుకుని తెస్తాను ఈ ఇంట్లో చెంబు, గిన్నె సమస్తం అమ్మి అయినా సరే వాడిని పెంచుతాను" అంది.

నేను రెచ్చిపోతూ అనకూడని మాట అనేశాను.

"ఈ ఇల్లు నాది. ఈ ఇంటి అద్దె నేను కడుతున్నాను. ఈ ఇంట్లో ఉన్న ప్రతి వస్తువూ నాదే. దానిమీద నీకు ఏ అధికారం లేదు. నీ తాలూకు చిల్లిగిన్నెలు, సొట్టపడిన బిందె అటకమీద ఉన్నాయి. నాటిని అమ్మి మహరాజులా పెంచుకో. నేను కాదంటే అప్పుడను" అని రివ్వున వెళ్ళిపోయాను మళ్ళీ అమ్మ ఆ ప్రసక్తి ఎన్నడూ తీసుకురాలేదు

## 34

సృష్టి చక్రం అలసటలేకుండా తిరుగుతోంది ప్రకృతిలో మార్పు, మనిషిలో మార్పు, ఈ రోజుల్లో మార్పు. కొన్ని సంవత్సరాలు ముందుకి దొర్లిపోయాయి. చైతన్య స్రవంతి పొంగిపోతూనే ఉంది. కానీ నా జీవితంలో ఏ మాత్రం మార్పులేదు

ఆ రోజు ఏప్రిల్ ఫస్ట్ :

నా పుట్టినరోజు. ఇరవైతొమ్మిది సంవత్సరాలు పూర్తయి ముప్ఫైలోకి అడుగుపెట్టాను. ఈ మూడు సంవత్సరాలలో నాలో ఏ మాత్రం మార్పు లేదు. సన్నగా అలాగే ఉన్నాను. ముఖంలో కాస్త గంభీర్యం వచ్చింది. అంతులేని నా ఆలోచనలకి ఫలితంగా కళ్ళకి కళ్ళజోడు వచ్చింది ఈ తలనొప్పి కళ్ళజోడుతో నేను అచ్చు ఆఫీసర్‌లా ఉంటాను అంటుంది విమల. నేను ఆఫీసర్ని అయ్యాను ఇప్పుడు. విమల నా దగ్గర పని ఎగ్గొట్టటానికి ప్రయత్నిస్తుంది కానీ నేను సాగనివ్వను విమలకి ఇప్పుడు ఓ కొడుకు కూడా.

కిరణ్ నా పుట్టినరోజు బహుమతిగా ఇచ్చిన ఆ మూడు చీరలూ స్టాండ్‌మీద ఎదురుగా ఉన్నాయి అవి చిరుగులు పట్టినా, వెలిసిపోయినా అవంటే నాకు చాలా ఇష్టం. నా అప్పులన్నీ తీరిపోయాయి. సోఫా కొన్నాను, డ్రస్సింగ్ టేబుల్ కొన్నాను. ఖరీదైన బెడ్ కొన్నాను. గుమ్మాలకి, కిటికీలకి పరదాలు అమర్చాను. అన్నీ ఉన్నా నా జీవితంలో నేను ఎప్పటికీ ఒంటరిదాన్నే.

ఈ మూడు సంవత్సరాలలో చెప్పుకోదగిన మార్పులే జరిగాయి. ప్రమీల భర్తకి హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ అవుతోందిట. అందుకని కొంతకాలం క్రితం ఇక్కడికి వచ్చేసింది ఇప్పుడు ప్రమీలకి కొడుకు పుట్టాడు. ప్రకాష్ హైదరాబాద్ బదిలీ చేయించుకుని వచ్చేశాడు. ఉష, సుధాకర్ ఉద్యోగాలు చేసుకుంటూ హైదరాబాద్‌లోనే ఉన్నారు. ఉష బి.ఏ. పరీక్షలు వ్రాస్తోంది.

కానీ నాకూ, అమ్మకీ మాత్రం పూర్తిగా కాంట్రాక్ట్సు తెగిపోయాయి. "అమ్మ" అని పిలిచి మూడు సంవత్సరాలవుతోంది.

ఒకసారి అమ్మ శశికి డబ్బు అవసరం, ఉషకి మంచి బట్టలు, చెంబు గిన్నె కొనాలి వెయ్యి రూపాయలు ఇవ్వమంది. "వెయ్యా" అని నోరు తెరిచాను.

"నీకు ఖర్చులు మాత్రం ఏమున్నాయి. అప్పులు కూడా తీర్చేశావు" అంది.

"నా దగ్గర డబ్బులేదు" అనేశాను

"నాతో అబద్ధాలు ఎందుకు చెప్తావే. నీ పాస్ బుక్ చూడలేదనుకున్నావా?" అంది కోపంగా.

"మీనాకి పెళ్ళి చెయ్యాలి" అన్నాను.

"ఒక వెయ్యి తీస్తే ఏం తరిగిపోదు" అంది.

"నేను ఇవ్వను."

"ఏం కట్టుకట్టుకు పోతావా?" అంది ఆగ్రహంగా.

"రేపు నేను ముసల్దాన్ని అయినా, లేవలేక

పోయినా ఈ త్యాగమూర్తులెవరూ నన్ను ఆదుకోరు. నాకు రోగం వచ్చినా, రొష్టు వచ్చినా ఎవ్వరూ చెయ్యరు. కాళ్ళూ చేతులు సవ్యంగా ఉన్నప్పుడే నాలుగు రాళ్ళు వెనకేసుకుంటే ఎవ్వరి ముందూ దేహీ అని చేయి చాచకుండా బ్రతకాలి అని నా ఆశయం. ఇక నాతో తర్కించకు'' అని వెళ్ళి పోయాను.

అంతే! ఆ రోజునుంచి మా ఇద్దరి మధ్యా మాటలు బంద్. అమ్మ నా పెళ్ళి గురించి దాదాపు క్రుంగిపోయింది కానీ నేను మొండిదాన్ని.

గతాన్ని సింహావలోకనం చేసుకుంటున్న నేను హఠాత్తుగా ఏడుపు వినిపించటంతో ఉలిక్కిపడ్డాను. బస్‌స్టాప్‌లో జనం బాగా ఉన్నారు. నేను కొంచెం ఎడంగా నిలబడ్డాను రోడ్డుమీద మూడు, నాలుగు సంవత్సరాల బాబు బోర్లాపడి ఏడుస్తున్నాడు. నేను చప్పున వెళ్ళి ఆ బాబుని ఎత్తుకున్నాను.

ఖరీదైనబట్టలు, మెడలో పులిగోరు, కాళ్ళకి బూటు గట్టిగా కొరకాలి అనిపించేలా ఉన్నాడు ముద్దుగా, బొద్దుగా ఉన్న ఆ బాబుని భుజాన వేసుకుని వీపుమీద మెల్లిగా తట్టుతూ బాబు తాలూకు మనుషుల కోసం వెతకసాగాను. బాబు ఎత్తుకోగానే ఏడుపు తగ్గించాడు. నేను అటూ, ఇటూ చూస్తున్నంతలో తెల్లటి బట్టలతో ఒకవ్యక్తి అటూ, ఇటూ చూసుకుంటూ ఇటే వస్తూ కనిపించాడు. నేను అతను బాబు కోసమే వస్తున్నాడనుకుని ఎదురు వెళ్ళాను.

''బాబూ'' అని పిలుస్తున్న అతను చప్పున ఆగిపోయాడు. నేను ఎదురుగా నిలబడ్డ వ్యక్తిని చూసి స్థాణువయిపోయాను. కళ్ళజోడు సవరించుకుని పరీక్షగా చూశాను. నేను నోటిమాట రానిదానిలా చూడసాగాను.

''సంధ్యా'' అతను సంభ్రమాశ్చర్యాలతో పలకరించాడు.

''కిరణ్'' నాకేమిటో మాటలు దొరకటం లేదు.

ఇద్దరం కాలం స్తంభించిపోయినట్లుగా అలాగే నిలబడిపోయాము తెల్లటి ప్యాంటూ, నలుపుమీద తెల్లటి చుక్కలున్న షర్టు, నడుముకి వెడల్పాటి నల్లటి బెల్టు అతనియొక్క రీవిని పెంచుతున్నట్టుగా ఉంది. అతని డ్రెస్‌లో ఏ మార్పూ లేదు. చేతిలో చివరికంటా కాలిన సిగరెట్టు క్రిందపడేసి బూటుతో నలుపుతూ నా చేతుల్లోంచి బాబుని అందుకుంటూ—

''హాపీ బర్త్ డే సంధ్యా'' అన్నాడు.

అతనికి ఎంత జ్ఞాపకం. మౌనంగా అతన్నే చూడసాగాను

''కనీసం థ్యాంక్స్ అనాలనికూడా గుర్తులేదా'' అన్నాడు నవ్వుతూ. నేను అప్పటికీ మాట్లాడలేదు

అతను చప్పున ఉలిక్కిపడ్డవాడిలా నా భుజం చుట్టూ చెయ్యివేస్తూ ''సరే! బాగానే ఉంది మనం రోడ్డుమధ్యలో నిలబడి ఒకరినొకరం చూసుకుంటూ నిలబడితే ట్రాఫిక్ అంతా బంద్ అయ్యేలా ఉంది'' అన్నాడు ఇద్దరం రోడ్డుపక్కకి వచ్చాము.

''ఏం సంధ్యా మాట్లాడకూడదని ఏమైనా భీష్మ ప్రతిజ్ఞ చేశావా?'' లాలనగా అడిగాడు.

నేను వణుకుతున్న స్వరంతో అతని చేతిని పట్టుకుని — ''నువ్వు... నువ్వు... ఇక్కడ... అసలు కిరణ్‌వేనా'' అన్నాను.

''ఆహ! అక్షరాలా. నువ్వు నిజంగా సంధ్యవే అయితే నేను నిజంగా కిరణ్‌నే'' అన్నాడు

''కిరణ్'' సంభ్రమంగా అన్నాను.

''ఎస్ మేడమ్'' తమాషాగా అన్నాడు నవ్వుతూ

''నాకిప్పుడు ఎలా ఉందో తెలుసా.. ఎంత ఆనందంగా ఉందో తెలుసా! నా జన్మలో నాకింత ఆనందం కలగలేదు'' అనేశాను.



"అచ్ఛా" అన్నాడు వెక్కిరిస్తున్నట్టుగా.

నేను పకపకా నవ్వాను. నవ్వుతున్న అతను ఆగిపోయి — "సంధ్యా నీలో ఏదో మార్పు కనబడుతోంది. ఏమిటది" అన్నాడు.

"మార్పా! ఏమిటది లావాయ్యానా" అన్నాను నొసుకుంటూ.

"ఊహూ కాదు."

"మరి"

"నీ మొహంలోనే ఏదో మార్పు. ఆ... తెలిసింది. నీకా కళ్ళజోడు ఏమిటి ?" అన్నాడు.

"ఓ .అదా... ఆఫీసర్ హోదా సర్" అన్నాను.

అతను ఫక్కున నవ్వాడు. బాబు కూడా చేతులు కొడుతూ పకపకా నవ్వాడు. నేను అప్పుడు గుర్తువచ్చిన దానిలా —

"కిరణ్ ఈ బాబు" అంటూ ఆగిపోయాను.

కిరణ్ ముఖంలో నవ్వు చెదిరిపోయింది. "నా వంశాంకురం" అన్నాడు.

నేను చప్పున వాడిని ఎత్తుకుని "అయితే ఈ రోజు నేను పుట్టినందుకు నా జన్మ సార్థకమయినట్టే. వీడిని ఈ ట్రాఫిక్‌నుంచి రక్షించాను" అన్నాను.

"ఇలాటివాళ్ళను రక్షించటం నీ కలవాటేగా సంధ్యా. నీ చెల్లెళ్ళు, తమ్ముడు కులాసాగా ఉన్నారా ?" అన్నాడు.

"ఎంతమందిని రక్షించినా ఈ ఆనందం వేరు. వీడు నా కిరణ్ కొడుకు" అన్నాను.

అతను దీర్ఘంగా నిట్టూర్చాడు "నువ్వేం మారలేదు సంధ్యా" అన్నాడు.

"అచ్ఛా !" నేను నవ్వాను.

బాబు నా కళ్ళజోడు లాగటానికి ప్రయత్నం చేస్తున్నాడు "బాబోయ్ కిరణ్ నీ కొడుకు నా కళ్ళజోడు లాగేస్తున్నాడు" అని గోలపెట్టాను. కిరణ్ నవ్వుతూ నా కళ్ళజోడు తీసి బాగ్‌లో పెట్టాడు.

"హమ్మయ్య మీరిప్పుడు ఆఫీసరమ్మగారు కారు. అచ్చు నా సంధ్యలా ఉన్నావు" అన్నాడు ఆ మాట నా చెవుల్లో మృదుమధురంగా మ్రోగింది.

"హోటల్‌కి వెడదామా ?" అన్నాడు. నేను వెంటనే అంగీకరించాను.

"బాబుని ఇలాయివ్వు" అని అందుకోబోయాడు

"ఊహూ నేనివ్వను" అన్నాను

నా భుజాల చుట్టూ అతనిచేయి నా చేతుల్లో బాబు, ఇంకో భుజానికి ఉన్న బ్యాగ్ కదులుతోంది అప్పుడు చూసేవాళ్ళెవరికైనా ఈ కిరణ్ నా భర్తయినట్టు, ఈ బాబు నా కొడుకు అయినట్టుగా అనుకున్నా అనుకుంటారు

అతను సిగరెట్టు తీసి ముట్టించుకోబోతుంటే 'ఆయ్' అని కసిరాను. 'సారీ' అతను నవ్వుతూ కొంచెం దూరంగా నడుస్తూ తాగుతూ అటూ ఇటూ చూస్తున్నాడు. నేను బాబుకి అవీ ఇవీ చూపిస్తూ నడుస్తున్నాను. కాసేపటికి కిరణ్ సిగరెట్టు పారేసివచ్చాడు

బాబు నా చేతుల్లో ఉండకుండా అటూ, ఇటూ దూకటానికి ప్రయత్నిస్తుంటే, పిల్లల్ని ఎత్తుకోడం అలవాటులేని నేను ఖంగారుపడుతున్నాను.

# జీవితవనంలో కొత్తగాలి

"తప్పు ! తప్పు !" అని నేను వారిస్తున్నా వాడు వినటంలేదు.

"ఊ" కిరణ్ ఉరిమిచూడగానే బాబు ఆగిపోయాడు. అతని చేయి నా భుజాలమీదుగా బాబు మీద పడింది.

"వీడికి పేరేం పెట్టావు" అన్నాను.

"ఊహూ ... పెట్టలేదు" అన్నాడు.

"పేరు పెట్టలేదూ.. " ఆశ్చర్యంగా అన్నాను.

"ఎవరు పెడతారు. నేను పారిస్ వెళ్ళిపోయాను. వాడంటే శ్రద్ధ ఎవరికి ?" అతని మాటలు బరువుగా ఉన్నాయి.

"అయితే వీడికి పేరు నేను పెడతాను. బారసాల చేసేస్తాను ఇప్పుడే !"

"ఓ.కే ... నీ ఇష్టం ... "

ఇద్దరం వెళ్ళి కూర్చున్నాము. నేను కొన్ని చెప్పాను. కిరణ్ కొన్ని చెప్పాడు. బాబు చేతికి అగ్గిపెట్టె ఇవ్వటంతో బుద్ధిగా కూర్చున్నాడు.

"పారిస్ నుండి ఎప్పుడు వచ్చావు కిరణ్ ?" అన్నాను హఠాత్తుగా.

"దాదాపు రెండునెలలు అవుతోంది."

"రెండు నెలలా !" ఉలిక్కిపడ్డాను.

"అవును" అతను ఇదివరకులా ప్రతిదానికీ క్రుంగిపోవటంలేదు. అతని ముఖంలో గంభీరత వచ్చింది ఎంత బాధకూడా ఆ గంభీరత చాటున అణిగిపోతోంది. అతను మానసికంగా బాగా పెరిగాడు.

"రెండునెలల నుంచీ నిన్ను కలుద్దామా, వద్దా అని ఆలోచిస్తూనే ఉన్నాను. కానీ ఇక నా వల్ల కాలేదు. నీ పుట్టినరోజుకి హాజరయ్యాను. నీ కోసం వస్తుంటే దారిలోనే కలిశావు" అతను మృదువుగా గంభీరంగా అన్నాడు. కానీ ఆ మాటల వెనక చెప్పలేని విషాదం.

నా కళ్ళు టేబుల్‌మీద వాలిపోయినాయి

"వచ్చే నెలలో అమెరికా వెళుతున్నాను."

"కిరణ్" నేను చివ్వున తలెత్తి చూశాను.

## శిలా విలాపం

నీ యింటి పునాదుల్లో పడేసి
నన్ను బంధించినా సహించుకుని
నీ భవనానికి బాసటగా నిలిచాను
నా నెత్తిని సుత్తితో మొత్తి
నన్ను ఖండ ఖండాలుగా చీల్చినా
నోరెత్తకుండా రహదారినై నిలిచాను
నీ కాళ్ల క్రింద అణచిపెట్టి
నా గుండెని వులితో దొలిచినా
నాట్య సుందరినై నిన్నలరించాను
ఇంత వుపకారం చేసినా
సుంత కృతజ్ఞత చూపక
నన్ను దృష్టాంతంగా
కరుణలేని నరుని గుండెతో పోల్చడం
నేను సహించలేను.

— పి. కామేశ్వరరావు

అతను కుర్చీలో వెనక్కి వాలాడు. నా వైపు తదేకంగా చూస్తూ —

"నీ గురించి ఏదైనా చెప్పు సంధ్యా" అన్నాడు

నేను తలెత్తి చూశాను. ఇద్దరి కళ్ళు కలుసుకున్నాయి. అతని కళ్ళల్లో ఇదివరకు చిందులువేసే చిలిపితనం లేదు ఇప్పుడా కళ్ళ నిండా అపారమైన ప్రేమానురాగాలు నా కోసమే దాగి ఉన్నాయన్నట్లుగా నిర్మలంగా నన్నే చూస్తున్నాయి

"ఏం చెప్పను."

అతను నిట్టూర్చాడు. "ఎలా బ్రతుకుతున్నావు సంధ్యా !"

"యంత్రంలా !" తడుముకోకుండా అన్నాను

అతను నెమ్మదిగా అన్నాడు — "ప్రమీల నా కంతా చెప్పింది. నా తప్పు చాలా ఉంది సంధ్యా ! అందుకే నీ జీవితం ఇలా అయిపోయింది."

"నీ జ్ఞాపకాల మధ్య నేను మహారాణిలా బ్రతుకుతున్నాను. నువ్వే ఇంకా మనశ్శాంతి లేకుండా దేశాలు పట్టి పోతున్నావు" వాడిగా అన్నాను.

"నువ్వు చివరికి బాగా రాటు తేలిపోయావు సంధ్యా !" నవ్వాడతను.

"కిరణ్ !"

"హూ ! ఈ ఆధునిక సమాజం ఉంది చూశావు సంధ్యా ! అది మహా యంత్రంలాంటిది దానికి దయాదాక్షిణ్యాలులేవు ఇంకో మనిషిని సాధ్యమైనంతవరకు పీల్చి పిప్పిచేసి కానీ వదలదు అందుకే నీ రక్షణలో పెరిగిన నీ తోబుట్టువులే నిన్ను అవసరం తీరగానే నిర్దాక్షిణ్యంగా నిన్ను వదిలేసి వెళ్ళిపోయారు" అతను ఎంత శాంతంగా చెప్పినా, చాలా పదునుగా ఉన్నాయా మాటలు

ఇంతలో బేరర్ సర్వ్ చేయసాగాడు నేను బాబును ఒళ్ళోకి తీసుకుని పెడుతున్నాను. అతను ఒక స్వీట్ తీసి —

"పుట్టినరోజు పాపాయి నోరు తెరవాలి" అన్నాడు. నేను నోరు తెరిచాను అతను నా నోట్లో పెట్టిన స్వీట్‌ని సగం కొరికాను. అతను మిగిలింది తన నోట్లో పెట్టుకున్నాడు. నా కళ్ళముందు నా జ్ఞాపకాల నీడల్లో కలిసిపోయిన వెనకటి సంఘటన మెరుపులా మెరిసింది.

అతను తింటూ — "మరి బాబుకి బారసాల చెయ్యావూ ?" అన్నాడు.

నేను నవ్వుతూ "ఓ.కే. చూడు. మరి ఉత్తినే బారసాల చెయ్యమంటే నేను చెయ్యను ప్రతిఫలమేమిస్తావు" అన్నాను

"నేను పేదవాడిని. అయినా నువ్వు కోరాలే కానీ ఆకాశంలోని చంద్రుడిని తెచ్చి ఇవ్వనుటోయ్" అన్నాడు.

నా కళ్ళల్లో చివ్వున నీళ్ళు తిరిగాయి

"మరి పేరు పెట్టేస్తున్నా !"

"సిదే ఆలస్యం."

నేను తినటంకూడా ఆపాను "కమల్ !"

"కమల్ !" కిరణ్ సంభ్రమంగా చూసి నా ముక్కుపట్టి ఊపుతూ —

"థ్యాంక్యూ ! థ్యాంక్యూ !" అన్నాడు మేం ఇద్దరం వాడికి స్వీట్ పెట్టాం

అతను హఠాత్తుగా అన్నాడు — "వీడు పుట్టగానే సుగుణ దగ్గిర వదిలివెళ్ళిపోయానుగా

ఈ మధ్య సుగుణకి కొడుకు పుట్టాడు. 'ఒరేయ్ అన్నయ్యా! నీ కొడుకుని పెంచటం నా వల్ల కాదు. ఇంకా ఎంతకాలం చూడాలి' అని దెబ్బలాడింది. పెంచుతానన్నావుగా సుగుణా! అన్నాను నోరు జారి. 'శుభ్రంగా మళ్ళీ పెళ్ళిచేసుకో – లేకపోతే ఎవరో పిల్లాడిని పెంచుకుంటానంటున్నారు. ఇస్తావా?' అంది. నా సొంత చెల్లెలేనా ఆ మాటలంది? అని ఎంత బాధపడ్డానో తెలుసా! ఆయాని పెట్టుకుని పెంచుతాను కాని ఎవరికి ఇవ్వను అని ఒక్కటేమాట చెప్పేసి బాబుని తీసుకుని ఇక్కడికి వచ్చాను" అన్నాడు.

నేను మెల్లగా అన్నాను "కిరణ్ ఒకవేళ నువ్వు పెంచలేని స్థితిలో ఎవరికైనా దత్తత ఇవ్వదలిస్తే నాకు చెప్పు. కమల్‌ని నేను పెంచుకుంటాను. నువ్వు పెంచమని ఎవ్వరినీ ప్రాధేయపడద్దు" డగ్గుత్తికతో అన్నాను.

అతను విషాదంగా అన్నాడు "మనం ఎన్నను కున్నాం. చివరికి ఎలా అయ్యాం. నా ఇంటి దీపంగా, నా బిడ్డల తల్లిగా నా జీవితంలోకి రావాల్సిన నువ్వు చివరికి...ప్చ్."

నా నోటికేదో అడ్డుపడ్డట్టె ఆగిపోయాను.

అతను వేదాంతధోరణిలో అన్నాడు. "మనకి ఉండీ ఉండి అనిపిస్తూ ఉంటుంది సంధ్యా ఈ జీవితం చాలా కఠోరమైనదని. మనకు తెలియ కుండానే జీవితంలో ట్రాజెడీ వస్తుంది. ఎలా రియాక్టవాలో తెలియదు. నవ్వాలో ఏడవాలో తెలియని పరిస్థితి. ఆ ట్రాజెడీని ఎదుర్కొనే మనస్థైర్యమూ ఉండదు" అతనిలో ఈ మూడు సంవత్సరాలుగా పేరుకుపోయిన మానసిక బాధ మూడు ముక్కల్లో చెప్పేశాడు.

"కిరణ్" నేను బేలగా చూశాను.

"డోంట్ బి సిల్లీ. ఏదో చెప్పేశాను. అన్నట్టు రేపు ఉదయం నేను బెంగుళూర్ వెడుతున్నాను. ఓ వారం రోజుల్లో వస్తాను." అన్నాడు మాట మారుస్తూ.

"వారం రోజులే" నా చేతులు గుండెలమీదికి పోయాయి.

"తప్పదు. తర్వాత రాగానే అమెరికా వెళ్ళిపోతాను."

నా మొహం వాడిపోయింది ఇతను మబ్బుల్లో మెరుపు మెరిసినట్టు కనిపించి, వెంటనే వెళ్ళిపోతున్నా డంటే నా గుండెల్లో దుఃఖం సుళ్ళు తిరగసాగింది మెల్లిగా అన్నాను –

"కిరణ్, ఈ వారం రోజులు బాబుని నాకివ్వు నేను చూసుకుంటాను."

"వీడు పుట్టింతర్వాత ఇంతవరకూ నేను వీడి ఆటపాటలు చూడలేదు సంధ్యా. నా అంత దౌర్భాగ్యపు తండ్రి ఏ పిల్లలకీ వద్దు." అతను బాధగా అన్నాడు.

"కిరణ్" నా మనసు ఆర్ద్రమైంది.

"ఈ రాత్రికి వీడు నా దగ్గిరే ఉంటాడు రేపు తెచ్చుకో" అన్నాడు.

"కిరణ్" నేను సంభ్రమంగా అన్నాను.

"కానీ ఒక షరతు. నువ్వు ఎయిర్‌పోర్టుకి రా నన్ను ఫ్లైట్ ఎక్కించి బాబుని తీసుకుని వెడుదువుగాని."

నేను సంతోషంగా అంగీకరించాను. కిరణ్ నా బాగ్ తీసుకున్నాడు. నేను బాబుని ఎత్తు కున్నాను.

నేను అంతకు ముందురోజే జీతం తీసుకున్నాను. బాంకులో వేద్దామని తెచ్చిన డబ్బు బాగ్‌లోనే ఉంది. కిరణ్ వారిస్తున్నా వినకుండా బాబుకి బట్టలు కొన్నాను. బిస్కట్లు కొన్నాను. 'బొమ్మలు రేపు కొంటాను' అన్నాను.

"ఇప్పుడవన్నీ ఎందుకు?" అని కోప్పడ్డాడు కిరణ్.

"నా జీవితంలో నాకోసం ఇంతవరకూ ఏం ఖర్చు పెట్టుకోలేదు. నువ్వు మాట్లాడకు" అని కసిరాను.

ఇద్దరం పబ్లిక్ గార్డెన్స్‌కి వెళ్ళాము. మధ్యాహ్నం సినిమాకి వెడదాం అన్నాను అతను సరేనన్నాడు. సినిమా చూసి అలా రోడ్లు తిరిగి హోటల్లో భోజనం చేశాము. బట్టలు నా బాగ్‌లో ఉన్నాయి. కిరణ్ నన్ను టాక్సీలో ఇంటిదగ్గర దింపాడు. ఈ రోజు టాక్సీల క్రింద కిరణ్ ఎంత ఖర్చుపెట్టాడో!

"నీ పుట్టినరోజు బహుమతి ఏం ఇవ్వాలో తోచలేదు" అన్నాడు.

"నీకన్నా విలువైన బహుమతి ఇంకేమైనా ఉందా?" అని కోప్పడ్డాను బాబుని గట్టిగా ముద్దు పెట్టుకున్నాను బట్టల ప్యాకెట్టు తీసి కిరణ్ చేతిలో పెట్టి "రేపు బాబు బట్టలు అవీ బాగ్‌లో పెట్టుకుని మర్చిపోకు" అన్నాను

కిరణ్ నా చేతిని ఆప్యాయంగా నిమిరి "గుడ్‌నైట్" అన్నాడు.

"అచ్ఛా! గుడ్‌నైట్" అన్నాను టాక్సీ వెళ్ళిపోయింది

నా గుండెల్లో దిగుల్లాంటేది కలుగుతోంది ఈ ఆనందం నాకు శాశ్వతం కాదు కిరణ్ మళ్ళీ వెళ్ళిపోతాడు. నాలో ఇప్పటివరకూ ఉన్న ఉత్సాహం ఎవరో ఊదేసినట్టుగా మాయమైంది తలుపు బిగించుకుని పడుకున్నాను. అంటే ఆ రోజు నా మనసు కలత చెందింది అని ఇంట్లో అందరికీ కొండగుర్తు గోడమీది 'జీవితవనం' నవ్వుతోంది

## 35

కిరణ్ నా పుట్టినరోజుకి మొదటిసారిగా కొన్న చీర కట్టుకున్నాను. అది పాత పడిపోయినమాట వాస్తవమే కానీ చిరగలేదు ఉత్సాహంగా ఎయిర్ పోర్టుకి వెళ్ళాను. కిరణ్ అప్పటికే నా కోసం ఎదురు చూస్తూ ఉన్నాడు. అంతకుముందురోజు కమల్‌కి నేను కొన్నబట్టలు వేశాడు.

"గుడ్ మార్నింగ్!" అన్నాడు నవ్వుతూ

"వెరీ వెరీ గుడ్ మార్నింగ్ సార్" అంటూ బాబుని ఎత్తుకున్నాను. బాబు బట్టలు, బొమ్మలు ఉన్న సూట్‌కేస్ నా ముందుపెట్టాడు.

"థ్యాంక్యూ!" అన్నాను.

కిరణ్ కళ్ళల్లో ఛాయా మాత్రంగా తడి మెరిసింది. మరుక్షణం గంభీరత ఆచ్ఛాదనగా వచ్చేసింది.

"ప్రమీ! బాబుని నీ దగ్గర ఈ వారంరోజులు ఉంచుతానంటే ఎంత సంబరపడిందో" అన్నాడు నా మనసు ఆర్ద్రత చెందింది.

కిరణ్ బెంగుళూర్ వెళ్ళిపోయాడు. నేను బాబుచేత టా, టా చెప్పించాను. బాబుని ఎత్తుకుని ఇంకో చేత్తో సూట్‌కేస్ తీసుకుని బయటకి వచ్చాను. ఆటోలో ఎక్కి బజారులో బాబుకి బట్టలు, బొమ్మలు, బిస్కెట్లు, చాక్లెట్లు కొనుక్కుని ఇంటికి వచ్చాను. ఆటో శబ్దానికి శశి పిల్లలిద్దరూ

బయటకి పరిగెత్తుకొచ్చారు. ఇంతలో శశి గుమ్మంలోకి వచ్చి చప్పన ఆగిపోయింది. ఆటో వాడికి మీటర్ చూసి డబ్బులిచ్చేసి పంపేశాను. ఒక చేతినిండా ప్యాకెట్లు, రెండో చేత్తో సూట్‌కేస్‌తో లోపలికి నడిచాను. బాబు నా చీరచెంగు పట్టుకుని బితుకుబితుకుమంటూ చిత్రంగా చూస్తూ వస్తున్నాడు నేను ఇంట్లోకి వచ్చాను.

సూట్‌కేస్ క్రింద పెడుతుండగా, అమ్మ వంట గదిలోంచి వచ్చింది. నా చేతుల్లో ఉన్న ప్యాకెట్స్ చూసి సంతోషంగా ఏదో అనబోయి కమల్‌ని చూడగానే ప్రశ్నార్థకంగా చూసింది. నేను బాబుని వదిలి సూట్ కేస్, ప్యాకెట్లు నా గదిలో పెట్టి వచ్చాను.

బాబుని ఎత్తుకుంటూ "పాలు ఉన్నాయా?" అన్నాను.

అమ్మ ఉన్నాయన్నట్టు తలూపింది.

"వద్దులేగానీ హార్లిక్స్ తీసుకురా" అని బాబుని ఎత్తుకుని గిరగిరా తిప్పాను. కమల్ నవ్వుతూ కేరింతలు కొడుతున్నాడు.

శశి నోరు తెరచుకుని చూస్తోంది. వాసు, శిరీష నన్ను ఆశ్చర్యంగా చూస్తున్నారు. కమల్‌ని ఎత్తుకుని అక్కడున్న కుర్చీలో కూలబడ్డాను. కమల్ ఒంటిమీద ఖరీదైన బట్టలు, మెడలో పులిగోరు, కాళ్ళకి బూటుతో రాజసం ఉట్టిపడుతున్నట్టుగా ఉన్నాడు. తన పిల్లలనీ, కమల్‌ని మార్చి మార్చి చూస్తున్న శశి కళ్ళల్లో ఈర్ష్య మెరమెరలాడింది.

అమ్మ హార్లిక్స్ తెచ్చింది. "ఎవరా బాబు" అంది.

నేను చిలిపిగా "నా దత్తపుత్రుడు" అన్నాను.

అమ్మ నిర్ఘాంతపోయింది. శశి ఎగిరిపడింది.

"పెంచుకుంటావా?" అమ్మ ఎలాగో అంది చివరికి.

"అవును" నవ్వాను.

"నీకంతగా పెంచుకోవాలనుంటే మనవాళ్ళ పిల్లలు ఎంతమంది లేరు."

"మనవాళ్ళ పిల్లలు నావాళ్ళు ఎలా అవుతారు?"

"శశి తన కూతుర్ని పెంచుకోమని ఎప్పుడో చెప్పిందిగా."

"ఇష్టంలేదు అని నేనూ చెప్పానుగా?"

క్షణం నిశ్శబ్దం తాండవించింది. నేను బాబుకి హార్లిక్స్ తాగించసాగాను. శశి తన పిల్లల్ని పెంచుకోమని ఏనాడో ఒత్తిడిచేసింది. ఛట్ అవసరంలేదని త్రోసివేశాను. అదీ అమ్మ కోపం. నాకింకా ఏడిపించాలనిపిస్తోంది.

"మనవాళ్ళ పిల్లాడేనా" అంది శశి.

"కాదు"

"అయ్యో! అయ్యో! మరి ఎలా పెంచుకుంటావే."

"రాజాలాగా పెంచుతాను. చూడగానే ముద్దు వచ్చాడు. యువరాజులాగా ఉన్నాడనిపించింది. అంతే తెచ్చుకున్నాను."

అమ్మ వెళ్ళిపోయింది. బాబుకి అన్నం తినిపించాను. బాబుతో పకపకా నవ్వుతూ చిన్నపిల్లలా

## జీవితవనంలో కొత్తగాలి

అల్లరి చేస్తుంటే శశి ముఖం గంటు పెట్టుకుని చూడసాగింది. ఉష పురిటికి ఆ రోజే వచ్చింది. సుధాకర్ కూడా తిండికి ఇబ్బంది అంటూ ఉష, అమ్మ పట్టుపట్టటంతో తనూ వచ్చాడు. ఇల్లంతా సందడిగా ఉంది. బాబు నా ప్రాణం అయిపోయాడు. నేను తలుపు గడియ వేసుకుని లోపల బాబుతో నవ్వుతూ, ఆడుతూ గడిపేశాను.

సాయంత్రం వాడికి బిస్కెట్లు అయిపోవటంతో బజారుకి వెళ్ళాను. బాబు నిద్రపోతున్నాడు. నేను తిరిగి వచ్చేసరికి లోపల గదిలో గోలగా ఉంది. బాబు ముందు గదిలో ఏడుస్తున్నాడు. మీనా వాడిని ఏడుపు మానిపించటానికి శతవిధాలా ప్రయత్నం చేస్తోంది. నేను ఒక్కంగలో కమల్‌ని ఎత్తుకుని గదిలోకి రాబోయి ఆగిపోయాను. శశి కూతురు నేను కమల్‌కి కొన్న బట్టలు వేసుకొని బొమ్మలతో ఆడుతోంది. శశి వాసుకి బొమ్మలు ఎలా కీ ఇవ్వాలో చూపిస్తోంది.

నా మనసు భగభగ మండిపోయింది.

"ఎవరు రమ్మన్నారు మిమ్మల్ని గదిలోకి?" బిగ్గరగా అన్నాను.

శశి ఉలిక్కిపడి చూసింది. అప్పుడే వాసు కీ ఇచ్చి వదిలిన విమానం నా ప్రక్కనుంచి దూసుకుని ముందు గదిలోకి వెళ్ళిపోయింది.

నేను ఆగ్రహంగా అన్నాను—"నిన్ను బొమ్మలన్నీ ఎవరు తియ్యమన్నారు. ఆ బట్టలు ఎందుకు తీశావు?"

శశి ఒక్కక్షణం తడబడింది. మళ్ళీ వెంటనే సర్దుకుని "ఇది నా పుట్టిల్లు. ఈ ఇంట్లో నాకు స్వతంత్రం ఉంది సర్వహక్కులు ఉన్నాయి" అని కూతుర్ని తీసుకుని విసురుగా బయటికి వచ్చింది. నేను బిస్కెట్టు ప్యాకెట్టు కమల్ చేతిలో పెట్టి వాడిని గదిలో వదిలి వెనక్కి తిరిగి తీక్షణంగా అన్నాను —

"ఇది నా ఇల్లు. ఈ ఇంటికి రెండు వందల రూపాయల అద్దె నేను కడుతున్నాను. హక్కులు అంటూ మాట్లాడకు నీ పరిధిలో నువ్వుంటే మంచిది" అన్నాను.

శశి నిశ్చేష్టురాలైపోయింది. పేకాడుతున్న ప్రకాష్, సుధాకర్ ఆట ఆపేసి చూస్తున్నారు



అమ్మ, ఉష బయటగదిలోకి వచ్చారు ఈ గలాభాకి అమ్మని చూడగానే శశి ఏడుస్తూ —

"చూడమ్మా! పిల్లలు ముచ్చటపడితే బొమ్మలు ఇచ్చాను. అంత మాత్రానికే ఎంతలేసి మాటలంటోందో" అంది.

అమ్మ కోపంగా "బొమ్మలు ఇచ్చినందుకే అల అన్నావుటే" అంది. శశి ఆక్రోశంగా అంది — "నా పిల్లలకి ఇంతవరకూ ఒక్క బొమ్మకొని పెట్టలేదు ఒక్కసారి బట్టలు కొనిపెట్టలేదు. ఏనాడు దగ్గర తియ్యలేదు. ఆ దిక్కూమొక్కూలేని వెధవని తెచ్చి ఇంత ఖరీదుగలవి తెచ్చి వాడిని స్వర్గం ఎక్కిస్తోంది" అంది ముక్కు చీదేస్తూ.

"షటప్" నేను ఆపుకోలేని కోపంతో అరిచాను.

"ఏం! అది తప్పుమాట ఏం అనలేదుగా" అంది అమ్మ.

"జాగ్రత్తగా మాటలు రానివ్వండి నా సంపాదన నా ఇష్టం. అడిగేందుకు మీరెవరు. నా సంపాదనలో దానం ఇచ్చుకుంటాను ధర్మం చేసుకుంటాను" విసురుగా అన్నాను.

"అలాగే చేసుకో. కాదన్నది ఎవరు? పెంచుకోడానికి నీకీ దిక్కుమాలిన వెధవే దొరికాడా" అంది ఉష అక్కకి వత్తాసుగా.

"నోర్మూయ్. నువ్వు దిక్కులేనిదానివి. మీరంతా దిక్కులేనివాళ్ళే. అందుకే నా సంపాదన తిని నా కాళ్ళక్రిందే నిప్పులు పోశారు. ఇంకా నన్ను చిత్రవధ చేస్తూనే ఉన్నారు. వీడు నాకు పరాయివాడు కాదు" హఠాత్తుగా దుఃఖపు తెర అడ్డురావటంతో ఆగిపోయాను.

"పరాయివాడు కాదూ ఏం నవమాసాలు మోసి కన్నావా?" శశి, ఉష ఒక్కసారే అన్నారు మరుక్షణం ప్రకాష్ శశి చెంప పగలగొట్టాడు.

"ఛట్ నోర్మూయ్! ఏమిటా వాగుడు" అన్నాడు.

నా కళ్ళనుండి జలజలా నీళ్ళు రాలాయి అయినాసరే కసిగా అన్నాను —

"నీ పిల్లలు నాకు పరాయివాళ్ళు. కాని ఈ బాబెవరో తెలుసా? నా కిరణ్ కొడుకు. నవమాసాలు మోసి వాడిని కని భార్య చచ్చిపోతే దిక్కుతోచని వాడిలా దేశాలు పట్టిపోయాడు. ఇన్నాళ్ళకి, ఇన్నేళ్ళకి మళ్ళీ నా కిరణ్ నాకు కనిపించాడు. వీడు నా కిరణ్ కొడుకయినప్పుడు, నాకు పరాయివాడెలా అవుతాడు" అనేసి విమానం బొమ్మ తీసుకుని గదిలోకి వెళ్ళిపోయి తలుపులు ధన్‌మని మూసేసి తల వెనక్కి వాల్చుకున్నాను. బొమ్మల మధ్య హాయిగా ఆనందంగా ఆడుకుంటున్న బాబు నన్ను చూసి చప్పన చేతులు చాచి వస్తున్నాడు. "కమల్" నేను వాడిని గట్టిగా గుండెలకు హత్తుకున్నాను.

శశి, ఉష ప్రేమించి పెళ్ళి చేసుకున్నవాళ్ళు. కాని వాళ్ళకి నా ప్రేమ సంగతి అసలు పట్టదు. ఎంతసేపు నేను వాళ్ళని ఉద్ధరించటానికే పుట్టాను అన్నట్టుంటుంది వాళ్ళ ప్రవర్తన. ఎంత స్వార్థపరులు? ఎంత ఇచ్చినా ఇంకా ఇవ్వలేదన్న ఏడుపే! నేను భారంగా కళ్ళు మూసుకున్నాను.

(ఇంకా వుంది)

# స్వయంగా మీకు చాలినంత లభిస్తున్నదని నమ్మకంగా మీరు చెప్పుకోగలరా?





'మా డాక్టరుగారు హార్లిక్స్‌ను సిఫారసు చేసినప్పటినుంచి మా కుటుంబమంతా రోజూ హార్లిక్స్ తీసుకునేట్లు అలవాటు చేశాను
మీరు కూడా మీ కుటుంబానికి హార్లిక్స్ ఇస్తున్నారా?''

చాలా మంది తల్లులు తమ తమ ఆహార పదార్థాలలో ఆరోగ్యానికి ఏది మంచిదో అది చాలినంత లభిస్తుందో లేదో స్పష్టంగా చెప్పలేరు

అందుచేతనే వారు హార్లిక్స్‌ను నమ్ముకున్నారు

హార్లిక్స్ రోజూ క్రమం తప్పకుండా తీసుకున్నట్లయితే మీ కుటుంబానికి పుష్టికరమైన సంపూర్ణ ఆరోగ్యం చేకూరుతుంది

ఎందుచేతనంటే, చిక్కటి పాలు, మాల్టెడ్ బార్లీ గోధుమ పుష్కలంగా హార్లిక్స్‌లో ఉన్నాయి అవే ప్రధాన పోషకాహారానికి మూలం

హార్లిక్స్‌ను నిత్యం తీసుకోవటం ఎంతో మంచిది మీ మనసులోని అన్ని చింతలనూ తొలగిస్తుంది.




## హార్లిక్స్-మంచి పుష్టికరమైనది

HTD-HMM-7042

( గత సంచిక తరువాయి )



















[ఇంకా ఉంది]

# స్వాతంత్ర్య సమరయోధులకు



శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధానమంత్రి)



## మన నివాళులు





శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

విదేశీ పాలనకు వ్యతిరేకంగా అహింస, సహాయ నిరాకరణ అనే ఆయుధాలతో మనం జరిపిన స్వాతంత్ర్య సమరం ప్రపంచ చరిత్రలోనే ప్రప్రథమమైనది. చరిత్రాత్మకమైనది. విదేశీ దాస్యశృంఖలాలనుంచి మాతృదేశాన్ని విముక్తి కలిగించే మహత్తర కార్యానికి అనేకమంది స్వాతంత్ర్య సమరయోధులు ఆత్మబలిదానం చేశారు. గాంధీజీ, జవహరాల్ నెహ్రూ, వల్లభాయ్‌పటేల్, సుభాష్‌చంద్రబోస్, ప్రకాశం పంతులు, డాక్టర్ పట్టాభి, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య కొండా వెంకటప్పయ్య, కాశీనాథుని నాగేశ్వరరావు, బులుసు సాంబమూర్తి, మాడపాటి హనుమంతరావు, స్వామి రామానందతీర్థ, అమలాపురం కేశవరావు బూర్గుల రామకృష్ణారావు, కల్లూరి సుబ్బారావు, కొండా వెంకట రంగారెడ్డి లాంటివారు మరి అనేకానేక మంది స్వాతంత్ర్య సమరయోధులు చేసిన త్యాగాన్ని తరతరాలుగా భారతీయులు భక్తిపూర్వకంగా స్మరించుకుంటారు.

**ఈ స్వాతంత్ర్య సమరయోధులు దేశానికి చేసిన సేవలు, త్యాగాలు ఈ రోజు స్ఫురణకు తెచ్చుకుంటూ, వారు చూపిన బాటలో ముందుకు సాగిపోతూ, వారికి సరియైన వారసులమని రుజువు చేస్తామని శపథకం తీసుకుందాం.**

---

సమాచార, పౌర సంబంధశాఖ డైరెక్టరుచే ప్రకటితము, హైదరాబాదు.

DIPR NO 45701/Advt/CI-3/81 Advt No. 58



# చెరకు పిప్పి

న్యాయపతి కమలారాంజీ

ఉదయం ఎనిమిది గంటలయింది. వంట హడావుడిలో వుంది విశాలాక్షి.

జగన్నాథంగారు గదిలో మూలనున్న మంచం మీద కూర్చున్నారు.

“ఆ షేవింగుసెట్టు యిలా అందుకో తల్లీ” అన్నారు లక్ష్మి నుద్దేశించి.

“అలాగే నాన్నా!” ఆమె లేచి వెళ్ళేలోగానే వంటింట్లోంచి విశాలాక్షి అందుకుంది.

“ఆ మాత్రం మీరు తెచ్చుకోలేరూ! పాపం దాని కెందుకు చెప్తారు? అసలే అత్తవారింట్లో పన్లతో నలిగి నలిగి వచ్చింది పిల్ల!”

“పర్వాలేదమ్మా, ఈ మాత్రానికేనా!” అంది లక్ష్మి షేవింగు సెట్టు తెచ్చి తండ్రి చేతి కందిస్తూ.

“నీకు తెలీదే లక్ష్మీ! ప్రతి చిన్న పనికీ యితరుల మీద ఆధారపడ్డం అలవాటయిపోయింది మీ నాన్నగారికి!” అంది వంటింట్లోంచే.

లక్ష్మి నవ్వేసింది ఆ మాటకి.

వంటింట్లోంచి యివతల కొచ్చింది విశాలాక్షి

ఈ చేతిలో సంచీ, ఆ చేతిలో అయిదు రూపాయల నోటు వుంది.

“ఈ పూటకూర లేదు. బజారుకెళ్ళి మంచి కూరలేవన్నా వుంటే పట్టండి. కాకర కాయలు దొరికితే తీసుకురండి. అమ్మాయికి ఎంతో యిష్టం. పెత్తనాలు చెయ్యకుండా వేగిరం వచ్చేయండి” అని పురమాయించింది భర్త చేతికి సంచీ, డబ్బు అందిస్తూ.

పొద్దున్నించీ అతనికి చాలా ఆకలిగావుంది. కాఫీ చుక్కతో కడుపు నిండుతుందా? ఆదోలా చూసేరు అతను.

“గోపాలాన్ని పంపించకూడదే. నాకు

యిప్పుడు తిరుబాటులేదు చిన్నపని వుంది" అన్నారు.

"ఏమిటావని ? గడియ తీరుబాటులేదు. గవ్వ ఆదాయంలేదు" అని "మీకేం పూరా ? వుద్యోగమా ? అంత తీరుబాటు లేకపోవ డానికి ? ! వాడిప్పుడు చదువుకోవాలి వాడు వెళ్లడు. కూరల మార్కెట్టు దగ్గరే కదా. మీరే వెళ్ళండి."

అతని జవాబు కోసం కూడా ఎదురు చూడకుండా వంటింట్లోకి విసవిసా వెళ్ళి పోయింది ఆమె !

భార్య మాటలోని ఎత్తిపొడుపుముల్లులా గుచ్చుకుంది అతని హృదయానికి.

తల దించుకున్నారు.

ఆ ఎత్తిపొడుపులన్నీ తను రిటైరయిన దగ్గర్నుంచీ అలవాటయి పోయేయి. మనసు బాధగా మూలిగింది–

"ఇదిగో. ఈ పళ్ళరసం తాగండి, బలం వస్తుంది."

"మీరు నీరసంగా వున్నారు, రెస్టు తీసు కోండి."

"ఇప్పుడెలా వుందండీ మీ వంట్లో?"

"వద్దొద్దు. మీరు ఆ పని చెయ్యొద్దు. నేను చేసుకుంటాను లెండి."

"మీరెందుకు పరుపులు పరవడం అదీ చేస్తారూ? నేను చేస్తాను. మీరుకూర్చోండి."

"ఆ పెద్ద బాల్చీ మీరు మొయ్యలేరండీ. గుండెలో నొప్పి వస్తుంది. నేను తెచ్చు కుంటాను. మీరు తేకండి."

"కాళ్ళు పట్టేదా? అరిపాదాలు మంటగా వున్నాయా? కాస్త నూనె రాసేదా ?"

"వెధవ కరెంటు ఎప్పుడూ వుండదు. మీరు ఉక్కకి తట్టుకోలేరండీ. వుండండి విసనకర్రతో విసురుతాను."

ఇలాంటి సేదతీర్చే వాక్యాలు ఆమె నోటి నుండి వినాలని అతని తహతహ !

కాని ఎప్పుడూ భార్య నుంచి విసవిసలు రుసరుసలే ఎదురవుతున్నాయి అతనికి !

అయిదు రూపాయల నోటు చొక్కా జేబులో పెట్టుకుని, సంచీ చేత్తో పట్టుకుని చెప్పులేసుకుని బయలుదేరుతూ నిట్టూర్చేడు మనసులోనే.

లక్ష్మి వచ్చి నాలుగు రోజులయింది. వచ్చిన దగ్గర్నుంచీ చూస్తున్నాది, తల్లి ఏదో మిషపెట్టుకుని తండ్రిని దెప్పి పొడవడం. సాధించడం, అవమానించడం, కసురుకోవడం, అన్నీను !

పాపం తండ్రి స్థితిచూస్తే జాలేస్తోంది.

అన్నిటికీ సహించి, భరించి వూరు కుంటున్నారు!

ఎలాంటి మనిషి ఎలా అయిపోయేరు?!

వార్థక్యం నిజంగా మనిషికి శాపమా?!

ఒకప్పుడు కోడి రామ్మూర్తిలా, కండలు తిరిగి వస్తాదులా వుండే వారు !

"నువ్వా-నేనా !" అన్నట్టు పుష్టిగా, ధృఢంగా వుండే ఆయన నేడు యిలా గాలి తీసేసిన బెలూన్‌లా, కడుపు లోతుకుపోయి, రొమ్ములు కవబడుతూ, దవడలుపీక్కుపోయి, కళ్ళు గుంటలుపడి వుండడం చూస్తూంటే కడుపు తరుక్కుపోతున్నట్టుంది లక్ష్మికి.

* * *

పరధ్యానంగా లక్ష్మి అన్నం కలుపు కుంటోంది.

"ఇంకొంచెం కూర వెయ్యవే" నాన్న అడుగుతున్నారు.

"వద్దు. వెయ్యను. మీకు అరగదు."

"ఫర్వాలేదు, వెయ్యి."

"వద్దని చెప్తూంటే మీక్కాదూ !"

"పోనీ ఆవకాయి అయినా వెయ్యి, నంజు కుంటాను." అతని గొంతు బతిమాలు తున్నట్టుంది.

"ఆవకాయా ?" ఏదో వినకూడని మాట విన్నట్టు ముఖం పెట్టింది ఆవిడ.

"వేడి చేస్తుంది, వెయ్యను. మీ యిష్ట ముంటే నేను పెట్టింది తినండి. లేకపోతే లేదు. తిన్నది అరక్క విరోచనాలు పట్టు కున్నాయంటే నేను చత్తలేక చావాలి."

"కానే. నా మటుకు నేను వెళ్తాను లేవే."

లక్ష్మి మరి వూరుకోలేకపోయింది.

"అమ్మా! ఆ పచ్చడి వెయ్యమ్మా నాన్నగారికి. కూర మరికొంచెం వెయ్యి – తింటారు" అంది.

"నీకేం తెలుసే ? నిన్నగాక మొన్న వొచ్చేవు. చాకిరీ చేసిన వాళ్లకి తెలుస్తాయి అందులోని సాధక – బాధకాలు ! తగుదు నమ్మా అని నీకే ఏదో పెద్ద అభిమానం వూడ బొడిచినట్టు మాట్లాడకు. మీ నాన్నకి ఎంత వడ్డించాలో, ఎలా వడ్డించాలో నాకు తెల్సు. అయినా మీ నాయనేం వుద్యోగాలు వెయ్యాలా ? వూళ్లేలాలా ? ఇంట్లో తిని కూర్చుంటే అరగొద్దూ ? !"

ఒక్క కసురు కసిరింది లక్ష్మిని.

తూటాలు గుచ్చుకున్నట్టున్నాయి ఆ మాటలు లక్ష్మికి "తనకే యిలా వుంటే యిహ నాన్నకెలా వుంటుంది !" అనుకుంది.

అన్నం తింటూన్న లక్ష్మికి చేదు వేపాకు ముద్దలు మింగుతున్నట్టు వుంది. మనసంతా చెప్పలేనంత బాధతో నిండిపోయింది. దుఃఖం వచ్చేస్తోంది కూడా ! తండ్రి అంత దీనంగా అడగడం, తల్లి జవాబులు, యివన్నీ వింటూంటే గుండెలో చెయ్యిపెట్టి కెలుకు తున్నట్టు అయింది...

ఒకప్పుడు సంచీలతో కూరలు తెచ్చి ఇంట్లో పోసేవారు నాన్న!

"నువ్వు కూరలు ఎక్కువ తిను విశాలా ! కూరలు ఎంత ఎక్కువ తింటే అంత నీ వంటికి మంచిదని డాక్టరుగారు చెప్పేరు. అసలు కూరల్లోనే వుంది బలం అంతా. చూడు. ఈ కూర మరి కొంచెం కలుపుకో" అని తనే చనువుగా గిన్నెలో కూరని తీసి విశాలాక్షి కంచంలో వడ్డించేవారు.

"విశాలా! నువ్వు బాగా తినాలి. చూడు ఎలా సన్నంగా అయిపోయేవో. హార్లిక్స్ రోజూ తాగు. పళ్ళు తెస్తాను. రోజూ తిను. నువ్వు ఆరోగ్యంగా, హాయిగా వుండడమే నా క్కావల్సింది" అనేవారు ఎంతో అభిమానంగా.

"అలాగే లెండి, మీరు తెచ్చిన జీతం నా హార్లిక్సులకే అయిపోతుందిలా వుంది" అనేది విశాల మూతి తిప్పుతూ. ఆ మాటకి మనస్సు చివుక్కుమనేది ఆయనకి.

"అలా అనకు విశాలా! నీకోసం నేను ఏం చేయమన్నా చేస్తాను. జీతం తక్కువైతే మాత్రం... పై రాబడి వుంది కదా..." మెల్లగా అనేవారు ఆమె కళ్ళల్లోకి చూస్తూ.

అదంతా జ్ఞాపకమొచ్చి నిట్టూర్చింది లక్ష్మి.

ఆమె తండ్రివైపే చూస్తోంది. జగన్నాథంగారి శరీరం ముడతలు పడి వుంది. కడుపు లోతుకుపోయి "నా తప్పేం లేదు. నన్ను పూర్తిగా నింపితే నిండకేంచేస్తాను?" అన్నట్టుంది. కళ్ళు లోతుకుపోయి కాంతి విహీనంగా వున్నాయి. ఆ కళ్ళల్లోని చూపులు అందరి దయా ధర్మాలమీద ఆధారపడి వున్నట్టు, అందరి మంచి సంపాదించు కోవాలని తహతహ లాడుతున్నట్టు వున్నాయి.

అప్పుడే స్నానం చేసి వచ్చి భోజనాని

క్కూర్చున్న ఆయన వంటిమీద, సరిగ్గా తుడుచుకోకపోవడంవల్ల, అక్కడక్కడా తడి యింకా వుంది మెడ దగ్గర మన్ను పట్టి వుంది. బహుశా తొందరగా భోంచేసెయ్యాలన్న తాపత్రయంలో సబ్బు సరిగ్గా రుద్దుకున్నట్టు లేదు.

అన్నం కలుపుకుంటూన్న అతని చేతివేళ్లు నీరసం వల్ల సన్నగా వణుకుతున్నాయి వేళ్ళ చివర్ల పొడవుగా పెరిగిన గోళ్ళల్లో దట్టంగా మన్ను పేరుకుపోయింది. వణుకుతున్న వేళ్ళతో అన్నం కలుపుకోలేక, ఆకలికి వుండలేక, పక్క పక్క నించి కొంచెం కొంచెం తినడం ఆరంభించేడు. చుట్టూ అన్నం కొంత కింద పడిపోయింది

విశాలాక్షి కొరకొరా చూసింది భర్త వైపు

"అన్నం అంతా అలా కిందామీదా పోయకపోతే కొంచెం చూసుకుని కలుపుకోకూడదూ! బజార్లో బియ్యం ధర చూస్తే మండిపోతున్నాది. అన్నం పారేసుకుంటే విలా



అవుతుంది? తిని కూర్చునేవాళ్ళకి మీకేం తెలుస్తాయి నా బాధలు? సంసారంచేసేవాళ్ళకి తెలుస్తాయి నా బాధలు?..." ఆమె మాటలు పూర్తిచేసినా, పెదవులు అదురుతూనే వున్నాయి కోపంతో.

వింతో పెద్ద తప్పు చేసిన వాళ్ళల్లాగ ముఖం గంటు పెట్టుకుని, తల వంచుకుని గబగబా భోంచేస్తున్న తండ్రిని చూసేసరికి కళ్ళల్లో నీళ్ళు నిండాయి లక్ష్మికి. అతికష్టం మీద అణచుకుంది.

"ఛీ! ఛీ! అమ్మ నోటికి హద్దూ పద్దూ లేకుండా వుంది. 'భర్త' అన్న గౌరవం లేదు అస్సలు" అనుకుంది బాధగా.

అమ్మ ఎందుకిలా తయారయింది?

కంచా లెత్తుతున్న లక్ష్మి తండ్రి తిని లేచిన కంచంవైపు జాలిగా చూసింది. కడిగిన కంచంలా వుంది అది!

ఆమె తన అసహాయతకు తనను తానే నిందించుకుంది.

తల్లికి ఎదురు చెప్పలేని పిరికిది లక్ష్మి!

* * *

కిటికిదగ్గర కూర్చుని రోడ్డుమీద వచ్చే పోయే వాళ్ళని చూస్తున్న లక్ష్మి ఆలోచనలన్నీ తండ్రి చుట్టూ తిరుగుతున్నాయి. రిటైరవక ముందు, వుద్యోగం చేస్తున్న రోజుల్లో, హుందాగా, దృఢంగావున్న తండ్రి రూపం గుర్తుకు రాసాగింది. ఆరడుగుల మనిషి. మంచి కండపుష్టి, ఎంత తిన్నా అరిగించుకునే శక్తి! ...అవన్నీ యిప్పుడేమయి పోయేయి! ?...

జగన్నాథంగారికి పెళ్ళాం అంటే బోలెడు అభిమానం. ఆమె ఏది కావాలన్నా తెచ్చిపెట్టి ఆమెను సంతోష పెట్టేవారు.

"ఏమండీ! పక్కింటి వదినగారు మళ్ళా నెక్లను చేయించుకుంది. నాకూ చేయించరూ అలాటిది!" భర్తకి దగ్గరగా జరిగి గోముగా అడిగేది విశాల.

"అలాగే విశాలా! డబ్బిస్తాను. ఇప్పుడేవెళ్ళి మంచుకొండవారి షాపులో ఆర్డరుయిచ్చిరా!" అనేవారు ఆయన.

"ఏమండీ! బెనారస్ పట్టు చీరలు కొత్తగా వచ్చేయట, రిబేటు వుందట. ఒకటి కొనుక్కుంటావండీ!" అనేది ఆవిడ.

"ఓ. తప్పకుండా. రెండు చీరలు తీసుకో" అనేవారు సంతోషంగా. ఆవిడ సంతోషమే అతని సంతోషం!

కష్టపడి సంపాదించినదంతా పెళ్ళాం చేతిలో పోస్తూ, సంతోషంతో వెలుగుతున్న ఆమె ముఖం చూసి తనూ సంతోషపడిపోయే వారు.

కొవ్వొత్తిలా తను కరిగిపోతూ, పగలూ—రాత్రి కష్టపడి ఆరోగ్యం పాడుచేసుకుంటూ కూడా, సుఖ-సంతోషాల వెలుగుని తన సంసారానికి పంచిపెట్టేరు.

కట్నంపోసి అయిదుగురు కూతుళ్ళకీ పెళ్ళిళ్ళు చేసేరు.

వారి రాక—పోక, ముద్దు—ముచ్చట అన్నీ చూస్తున్నారు.

వుద్యోగం చేస్తున్న రోజుల్లో అయితే ఎంత డబ్బు అంటే అంత వచ్చి పడేది. రిటైరయిపోయేక యిప్పుడెవరిస్తారు?

వచ్చిన పెన్షనుతో ఇల్లు గడుస్తున్నాది ఎలాగో! ఫిక్స్‌డ్ డిపోజిట్ తాలూకు వడ్డీ ఆదుకుంటున్నాది అప్పుడప్పుడు.

పెళ్ళాం మనస్సు కష్టపెట్టడం అతని కిష్టం వుండేది కాదు. అసలతను ఎవ్వరి మనస్సు కష్టపెట్టేవారు కాదు. అప్పటికీ యిప్పటికీ అంతే.

కడుపున పుట్టిన పిల్లల్నికూడా "అమ్మా! తల్లీ! బాబూ!" ఆప్యాయంగా పిలవడం, అడిగింది యివ్వడం తప్పితే ఏనాడూకోపంతో కళ్ళెరచేసి ఎరుగరు!

* * *

వచ్చేపోయే వాళ్ళను చూస్తూ, మధ్య మధ్యలో చేతిలో వున్న పత్రిక తిరగేస్తున్న లక్ష్మి తన చేతి వేళ్ళవంక, గోళ్ళవంక చూసుకుంది. ఎర్రని గోళ్ళు, రంగు వేసిన గోళ్ళు అందంగా మెరుస్తున్నాయి.

అప్రయత్నంగా తండ్రి చేతి గోళ్ళు జ్ఞాపకం వచ్చేయి. లేచి నెయిల్ కటర్ తీసుకుని తండ్రి దగ్గరకు వచ్చింది. గోళ్ళు తీస్తూ అంది– "మీ గోళ్ళల్లో ఎంత మన్ను పేరుకుపోయిందో చూసేరా? ఇదంతా భోంచేస్తున్నప్పుడు మీ కడుపులోకెళ్ళి హాని చేస్తుంది. వారంకొకసారయినా గోళ్ళు కత్తిరించుకుంటూ వుండండి నాన్నా!"

"వేళ్ళు వణుకుతాయి తల్లీ, వణకు రోగం పట్టుకుంది నాకు. ఏం చెయ్యడం చెప్పు!"

"అమ్మకి చెప్పండి!"

విట్టూర్చేడు ఆయన.

"అమ్మకి నా పన్లు చూసేటంతటి తీరుబాటు, ఓపికా ఎక్కడుందమ్మా? చెరకు పిప్పినమ్మా నేను, చెరకు పిప్పిని" బాధగా అన్నాడు ఆయన.

మళ్ళీ కళ్ళనిండా నీళ్ళు నిండిపోయేయి లక్ష్మికి.

"అలా అనకండి నాన్నా! నాకెంతో కష్టమనిపిస్తుంది" అంది లక్ష్మి.

అంతకంటె ఎక్కువ ఏమీ అనలేకపోయింది.

ఏమనగలదు? ఏమనడానికైనా తనే పాటిది?

"సాయంత్రం మనం సినిమాకి వెళ్దాం. వస్తారానాన్నా! రిక్షాలో వెళ్దాం" అంది లక్ష్మి

ఒకప్పుడు అతనికి సినిమా అంటే తగని పిచ్చి. ఇప్పుడు సినిమా కెళ్ళాలంటే విశాలని అడగాలి; ఒక్క సినిమాకే కాదు ఏ పని చెయ్యాలన్నా పెళ్ళాంని అడిగే చెయ్యాలి. ఆఖరికి ముష్టివాడికి యిన్ని బియ్యంగింజలు వెయ్యడానిక్కూడా పెళ్ళాం పర్మిషను తీసుకోవాల్సిందే.

విట్టూర్చేరు ఆయన—

"మీరు మరేం ఆలోచించకండి నాన్నా. ఇప్పుడు రెస్టు తీసుకోండి. సాయంత్రం సినిమాకు వెళ్దాం" అంది లేస్తూ.

"తను యిక్కడ వున్నన్ని రోజులూ తండ్రిని సంతోషపర్చాలి. సినిమాలకి తీసుకు వెళ్ళాలి. అమ్మకి తెలియకుండా తండ్రి



## చెరకు పిప్పి

కిష్ణమైన మసాలా దోసెలు హోటలుకి తీసుకెళ్ళి తినిపించాలి. మంచి బట్టలు కొనాలి" నిశ్చయించుకొంది లక్ష్మి

"అమ్మా! నేను, నాన్నా సినిమా కెళ్తాం, నువ్వు వస్తావా?" అడిగింది లక్ష్మి సాయంత్రం

"నేను రానే. నేనూవస్తే యింటిదు చాకిరీ ఎవరు చేస్తారు వచ్చి? నువ్వు వెళ్తే వెళ్ళు నీ యిష్టం. కాని మీరాన్నెందుకుమధ్య, అతనికేం కనబడాలా? డబ్బులు దండగ."

లక్ష్మి మనసు చివుక్కుమంది అమ్మ మాటలకి. ఆమె మాటల తీరే అంత అని సరిపెట్టుకుంది మళ్ళీ.

"అదేమిటమ్మా అలా అంటావు? నాన్నకి విశేషంలా కనిపిస్తుంది. మేము వెళ్తాం" అంది.

"మువ్వున్న నాలు రోజులు సినిమాలకు తిప్పుతావు. తర్వాత నీ దారిని నువ్వు వెళ్ళి పోతావు అత్తవారింటికి. తహా నా ప్రాణాలు తీస్తారు మీ నాన్న, రోజూ సినిమాకి డబ్బులిమ్మని." గొణిగింది విశాలాక్షి.

"అమ్మా! నోర్మూసుకో. మరెప్పుడూ అలా మాట్లాడకు" అని అరుద్దామను కుంది. కాని —

"ఏంటమ్మా ఆ మాటలు!" అంది.

పీకందాకా కోపంవచ్చింది. అప్పులు తండ్రి అంటే ఎవరు అనుకుంటోంది? తన భర్త కాదూ?

భర్తని గౌరవించడం తెలిని ఒక స్త్రీ తనకి జన్మనిచ్చింది అని తల్చుకుంటేనే సిగ్గుగా వుంది లక్ష్మికి.

రిటైరయిపోయినంత మాత్రాన వాళ్ళు మరి మనుష్యులు కారా? వాళ్ళకు మనసు వుండదా? ఆలోచనలు వుండవా? యిష్టా లుండవా? సరదాలుండవా? వాటన్నిటినీ చంపేసుకోవాలా?

అసలు తనీనాడు యీ స్థానంలో వుందంటే దానికి కారణం ఎవరు? ఈ సంపాదనంతా ఎవరిది? తను గడించిందా? లేక పుట్టింటివాళ్ళు యిచ్చేరా?

"రిటైరయ్యేక్కూడా ఎంతోమంది మళ్లీ వుద్యోగాలు చేసుకుంటున్నారు. మీరు ఉద్యోగం చెయ్యండి" అని రోజూ పోరే. అరిగిపోయి తుప్పు పట్టి పోయిన మిషను




# మిక్సర్ గ్రైండర్

## దక్షిణ ఇండియా వంట పనులను కూడా దిట్టంగా యెదుర్కొన తయారైంది

దక్షిణ ఇండియా వంట పనుల అవసరములను దిట్టంగా యెదుర్కొనుటకు తగిన శక్తి గలిగియుండుటయే యెటువంటి మిక్సర్ గ్రైండర్‌కైనా చివరి పరీక్ష. జాన్సన్ మిక్సర్ గ్రైండర్ యీ కఠిన పరీక్షయందు విజయవంతంగా నెగ్గి, నేడు దక్షిణ ఇండియా యందంతట సాటిలేని పేరు ప్రఖ్యాతులకు చిహ్నంగా అగ్రశ్రేణి నందుకొనియున్నది.

ఇందుకు కారణం:



**భారమైన పనులకు శక్తివంతమైన 450 వాట్ మోటారు** సాధారణమైన బరువుతో పనిచేయవలసినపుడు 45 నిమిషముల కాలం నిలువకుండా సురక్షితంగా పని చేయగలదు—ఇడ్లీలకు వెట్ గ్రైండింగునందు మరియు మసాలాలకు డ్రై గ్రైండింగునందువలనే



**త్వరగా చక్కగా చల్లబడుటకు** సాటిలేని పంకా చల్లని గాలిని లోనికి తీసికొంటూ, వేడి గాలిని పైభాగమునందలి వెంట్ ద్వారా శీఘ్రంగా వెలికి పంపును. మోటారు యెక్కువ కాలం చల్లగా వుంటుంది. మవి మరకలను తగ్గిస్తుంది.



**అధిక వసతికి మరియు అధిక ఆరోగ్యమునకు రెండు జాడీలు:** ఒక పనినుండి మరొక పనికి మారుటకు వసతి కలుగును.

**పలు రకములైన వంట పనులకు వివిధోపకరములైన రెండు బ్లేడ్లు:** కలుపడం, రుబ్బడం, దంచడం, పలుచపర్చడం, పోగుచేయడం లేక చిలకడం పనులయందు పటు.



**అధిక శుభ్రతకు దిట్టంగా అమర్చబడిన బ్లేడ్లు:** రెండు బ్లేడ్లుకూడా గోపురాకారపు దిమ్మలపై దిట్టంగా బిగింపబడి యున్నవి. వేరు వేరు పనులకు వేరు వేరు బ్లేడ్లు బిగింపవలసిన అవసరం లేదు. వదులుగా బిగింపబడిన బ్లేడ్లు వూడి వచ్చు ప్రమాదాన్ని తొలగిస్తుంది.



**పరిశుభ్రంగా కడుగుటకు వసతిగా సులభంగా విడదీయ వీలైన విడి భాగములు.** మరియు సాటిలేనటువంటి కప్ రూపమందున్న వాషర్ లోనికి ఆహారపు ముక్కలు పోయి అక్కడే చిక్కి వుండి పోనివ్వకుండా చేస్తుంది.




**చక్కగా పని చేయుటకు ప్రత్యేకంగా రూపొందింపబడిన బ్లేడ్లు:** రెండు బ్లేడ్లు ఒకే సమయంలో ఒకదాని కొకటి అనుకూలంగాను మరియు పైకి క్రిందికి తిరుగుటకు వసతిగాను యేర్పాటైనందున ప్రతిముక్క పూర్తిగ తిరుగుటకు వీలవును. చిక్కులు వుండవు.



**సులభంగా తిరుగుటకు వసతిగా అందంగా రూపొందింపబడిన అక్రిలిక్ జాడి:** ప్లాస్టిక్ జాడీయొక్క లోపైపు తగిన విధంగా వంపులు తిరిగి బ్లేడ్ల చలనమునకు అనుకూలంగా వుంటుంది. అందువలన యందలి ద్రవములు ఒకే విధంగా కలిసిపోతాయి.



సులభమైన పట్టునకు చక్కగా రూపొందింపబడిన పిడులు.

తేలికగా వేగమును మార్చుటకు వీలుగా అంచెల గుర్తులు గల ప్రత్యేకమైన స్విచ్చి.

అందమైన సొగసు—సఫైర్ బ్లూ, ఐస్ గ్రీన్, అల్ట్రా వైట్, మరియు జర్మన్ రెడ్ రంగులలో కోరినది యెన్నుకొను వసతి.

ఒక విడాది పూచీ మరియు అమ్మకం తరువాత అవసరమైన మరామతులు వెను వెంటనే చేయబడు వసతి దక్షిణ ఇండియాలో అధిక సంఖ్యలో చిల్లర విక్రయశాలలు గలవు.




శక్తియందు, వనితనమునందు నిజంగా శ్రేష్టమైనది.

Parade/BE/8161






బులుసు వేంకటరమణయ్య

## బాహ్యసౌందర్యం

భగవంతుని సృష్టిలో అందరూ ఒక్క రీతిగా ఉండరు. కొందరు అందంగా కానవస్తారు, కొందరిని చూస్తే ఏవగింపు కలుగుతుంది. అయినా ఈ పరిస్థితిలో మార్పు కలుగుతూనే ఉంటుంది చిన్నప్పుడు వికారంగా కానవచ్చేవారు కొందరు వయస్సు వచ్చాక చక్కగా కానవస్తూ ఉంటారు. వయస్సులో ఉన్నప్పుడు చక్కగా కానవచ్చిన వారు వయస్సు మళ్ళాక వికారంగా కనబడ వచ్చును దీనికి కాలమే ప్రబలకారణం. అందువల్ల భౌతిక సౌందర్యం స్థిరంగా ఉంటుందని భ్రాంతి పడకూడదు. కాలాన్నిబట్టీ, పరిస్థితులనుబట్టీ ఒకప్పుడు చక్కని వారే మరొకప్పుడు వెక్కిరింపుకు గురిఅవుతూ ఉంటారు.

ఒకరాజు, వయస్సు వచ్చిన తన కుమారుణ్ని వివాహం చేసుకోవాలని కోరాడు. "మీరు మరే ప్రశ్న వేయకుండా, నాకు వచ్చిన అమ్మాయిని నేను పెళ్ళి చేసుకోడానికి సమ్మతిస్తే అలాగే చేస్తాను" అని ఆ యువరాజు అన్నాడు. తండ్రి దానిని సమ్మతించాడు.

ఒకనాడు రాజకుమారుడు గుర్రమెక్కి విహారానికి వెళ్ళుతూ ఉండగా, ఊరిప్రక్కనున్న నదిలో స్నానం చేస్తూ ఉన్న అందకత్తె అయిన ఒక బాలిక కనబడింది. వెంటనే అతని మనస్సు ఆమెపై లగ్నమయింది. ఇంటికి మరలివచ్చిన యువరాజు ఆ అమ్మాయినే తాను వివాహమాడుతానని తండ్రితో చెప్పాడు. తండ్రి వాకబు చెయ్యగా, ఆ బాలిక ఒక వైశ్యుని పుత్రిక అని తెలిసింది. వైశ్య బాలికను కోడలుగా గ్రహించడం రాజు కిష్టంలేదు. అయినా, కుమారుని కిచ్చిన మాట ప్రకారం మారుమాట చెప్పక, ఆ వైశ్యునికి వర్తమానం పంపాడు, అతని పుత్రికను తన కోడుకును కిమ్మని.

వైశ్య బాలికకు మతం పై ఆదరం ఎక్కువ ఇతర జాతి యువకుని పెండ్లాడడం ఆమె కిష్టం కాదు. రాజు కోరికను తిరస్కరిస్తే ప్రమాదానికి గురి కావలసి వస్తుందని ఆమెకు తెలుసు. ఆమె ఆలోచించి, ఎనిమిది రోజుల తర్వాత మనుష్యులను పంపిస్తే తాను వచ్చి రాజబంధువుల సమక్షంలో యువరాజును పెండ్లాడగలనని సమాధానం చెప్పింది. తర్వాత ఆమె ఏమీ భుజించక ప్రాణాలు నిలుపుకొనుటకు కొంచెం జలం త్రాగుతూ చిక్కి, శల్యావశిష్టయై ఎనిమిది రోజులు గడిపింది. తొమ్మిదో రోజు రాజపురుషుల పల్లకీ తేగా, ఆమె మేలి ముసుగుతో అందులో కూర్చుంది. తనతో మూతలు బిగించిన ఎనిమిది మట్టి పాత్రలను కూడా పలకిలో ఉంచింది. ఆ పాత్రలతో కూడా రాజాంతఃపురం ప్రవేశించి, మేలి ముసుగు తీసివేసింది. చప్పి దౌడలతో, లోపలికి పోయిన కన్నులతో, చిక్కి శల్యావశిష్టమైన ఆమెను చూచి ఆశ్చర్యపడి యువరాజు "నీ సౌందర్యమంతా ఎక్కడికి పోయింది?" అని ప్రశ్నించాడు. "దాన్ని, ఒక్కొక్కరోజూ కొంత కొంత ఈ పాత్రల్లో నింపాను" అని ఆమె జవాబిచ్చింది. యువరాజు తత్వాన్ని గ్రహించాడు. అతనికామె వద్దులేదు. ఆమెకు గండం గడిచింది.

[భగవాన్ సత్యసాయిబాబా కథ ఆధారంగా.]

---

తిన్నాళ్ళ పనిచేస్తుంది? ఆప్యాయంగా నాలుగు మాటలు మాట్లాడి అతని అవసరాలని చూడాల్సింది పోయి...

చీర కట్టుకుంటున్న లక్ష్మి కోపంతో పళ్ళు కొరికింది.

కష్ట సుఖాల్లో తోడు - నీడగా వుండాలనీ, పాలు - నీళ్ళలా కల్సిపోయి, సుఖాలతోపాటు దుఃఖాలని కూడా సరిసమానంగా పంచుకోవాలనీ, పిల్లలు పెద్దవాళ్ళయి వివరి దారిన వాళ్ళు వెళ్ళిపోయేక 'నా' అన్న తోడు ఒకటే వుండాలని, మనస్సుకి దగ్గరగా వచ్చి మనస్సు వర్ధంచేసుకుని "మీకు నేను, నాకు మీరు" అని ఓదార్చే వారుండాలని, ఒక స్త్రీని అగ్ని సాక్షిగా తన జీవితంలోకి ఆహ్వానించాడే ఆ మగాడు!

## చెరకు పిప్పి

మరి ఆమె ఇంతవరకు అతని కష్టసుఖాల్లో పాలు పంచుకుంది?

తండ్రి సంసారం కోసం, పెళ్ళాం కోసం, తన సర్వస్వం ధారపోసేరే? అతనికి దొరికే ప్రతిఫలం యిదేనా? ఈ ఈసడింపులూ, ఈసడింపులూనా?! ఛీ! ఛీ! పాముకి పాలు పోసినట్టు ... బూడిదలో పన్నీరు పోసినట్టు...ఫీలయింది లక్ష్మి.

సినిమా హాలులో కూర్చున్న లక్ష్మి ఏదో దృఢనిశ్చయానికి వచ్చినదాన్లా తండ్రితో అంది—

"నాన్నా! మీరు నాదగ్గర కొచ్చివుండండి నాన్నా, ఆయనేమీ అనరు. మాతో పాటు వుందురుగాని."

ఆ మాటకి అదోలా చూసేరు ఆయన.

"పిచ్చిపిల్లా! నీ బాధ నా కర్థమయిందమ్మా. అమ్మ గురించే కదూ ఆలోచిస్తున్నావు. అమ్మ మాట కరకు గాని మనసు నవనీతం తల్లీ, నీకు తెలీదు అమ్మ మనసు! అయినా ఎవరెక్కడుండాలో అక్కడే వుండాలి. నా గురించి నువ్వేం బెంగ పెట్టుకోకమ్మా. నేను నిక్షేపంలా వున్నాను" అన్నారు గంభీరంగా.

లక్ష్మి మాటలురాని మూగదానిలా వుండి పోయింది తండ్రి వైపే చూస్తూ. ఆమెకి అతని ఔచిత్యాన్ని, క్షమాశక్తినీ ఏ విధంగా అర్థం చేసుకోవాలో అంతుపట్టడంలేదు

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## మహాకవి ముదిగొండ వీరభద్రమూర్తి :

నాలుగు దశాబ్దాల నాటి మాట. వేటూరి ప్రభాకరుల వద్దకు ఒక యువకుడు వచ్చాడు. ప్రభాకరులు ప్రార్థనానంతరం అరమోడ్పు కన్నులతో ఏదో ముచ్చటిస్తున్నారు. అక్కడ ఆసీనులైన వారంతా తదేక ధ్యానంగా ప్రభాకరులు పలుకులు వింటున్నారు. ప్రక్కకు చూస్తే ఏ పలుకును జారగొట్టుకుంటామో అన్నట్లుగా, ఆ యువకుడు, అందరినీ కలయజూశాడు. తనూ ఒక చోట చతికిలబడ్డాడు. గంటయింది. ప్రభాకరుల ప్రసంగం ఆగేట్లు కనిపించలేదు. యువకుని ముఖంలో, చిరాకు రేఖలు కనిపించాయి. మరోక సారి వద్దాం, ఇవాళ పని గిదా అన్నట్లు లేచిపోయాడు. అంతలో ప్రభాకరులు కూర్చోమని సైగ చేసి, రెండు నిమిషాల తర్వాత కుశల ప్రశ్నలు వేశారు. కావ్య శ్రవణానికి వచ్చాడని తెలిసిన తర్వాత "అయితే చదువండి" అన్నారు. వీళ్ళంతా ఎవరు? కావ్య శ్రవణానికి అర్హులో, కాదో అన్నట్లు ఆ యువకుడు మా అందరినీ మరోమారు తేరిపార చూశారు. "వారంతా నా వారే. చదవండి" అన్నారు ప్రభాకరులు. ఆ యువకుడు ఖంగుమనే కంచు కంఠంతో —

నైషధ కావ్య మాంధ్ర మొనరించిన
　మా కవినాథ శేఖరున్
భూషణమా మదీయ కర
　భూషణ లేఖిని మై కుతూహలిన్
యూషమున చూరలిచ్చి విబు
　దోత్కరమున్ గణియింతువన్న సం
తోషము సంతరించితి ని
　నున్ భజియింపతి మాటనిల్పవా ?

అని పఠించాడు. గమక పద్ధతిని బట్టి సంగీత జ్ఞానం కలదా అనిపించింది. ఆ నాటి ముదిగొండ వారి కంఠం నేటికీ రాజధాని కవి గోష్ఠులలోను రేడియో స్వీయ కవితాపఠనం, సమ్మేళనాలలోను వెక్కుచెదరక, ఒక జీరన్నా పోక రణనానురణాలు చేస్తుండడం వింటున్నప్పుడు, అయిన కంఠాన్ని శ్రీమా చేశారా? అనిపిస్తుంది. అప్పుడు మరి డెబ్బయి మూడేళ్ల వయస్సులో ఆ కంఠమేమిటి మరి యువ రచయితలను సిగ్గుపరిచేలా? మంచి కంఠం లేని కవులు కావ్యాలను పూర్వం రాజస్థానాలలో గమకులు చదివి వినిపించేవారు. గమకికి కవికున్న స్థానం వుండేది. కవి గమకుల పైన ఎన్నో పిట్ట కథలూ వున్నాయి. కంచు కొండంత కంఠం గల ముదిగొండ వారి వంటి కవులకు ఏ నాడూ గమకుల వాదోడు అవసరం లేదు. కంఠాన్ని మించిన కవితా ముదిగొండ వారి పుణ్యం. మిత్రులు డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యంఅన్నట్లు విశ్వనాథ మెచ్చుకొన్న కవిత, శ్రీశ్రీ సంతోషించిన నవత ముదిగొండ వారి కావ్య రసాయనంలో ఉన్న ఘనత. ముదిగొండ వారు గుంటూరు జిల్లా మాదల గ్రామంలో 1908 మార్చి 8 వతేదీన జన్మించారు. తండ్రి శ్రీ మల్లికార్జున శాస్త్రి గారు మంచికవి. తల్లి శ్రీమతి నాగమాంబగారు విదుషీమణి, ఆరాధ్య శైవ సంప్రదాయ గురుపీఠం వారు. సంప్రదాయ సిద్ధంగా వచ్చిన శివ భక్తిని ఎముకానికి దేశ భక్తితో సంవదింపబడి చదువు వదిలి బెజవాడ చేరి సహాయ నిరాకరణోద్యమంలో దూకారు. పాశ్చాత్య పాలనను నిరసించినా, పాశ్చాత్య సాహిత్యాన్ని ప్రేమించే వారు గనుక, చెన్నపురికి వెళ్లి కేంబ్రిడ్జి సీనియర్ పరీక్షకు కూర్చున్నారు. లాటిన్‌లో వెగ్గనందున చదువు మానేసి కాంగ్రెస్ వలంటీరుగా పని చేస్తూ, ఒక విద్యాధికారి పుత్రుని మైత్రి సాహచర్యంతో ఇంగ్లాండు వెళ్లి కొంత కాలం ఉండి విలువలను వివేచించే విలువైన అనుభవం సంపాదించారు. పిదప ఖమ్మం జిల్లాలో వ్యవసాయం మొదలు పెట్టి బ్రాహ్మణవ్యవసాయమనే సామెతకు అపవాదం కల్పించారు. గురుముఖంగా గీర్వాణ భాషను, ఆదరంతో ఆంధ్ర, ఆంగ్ల సాహిత్యాలను ఆకళించుకొన్నారు. శ్రీ దేవీమహిమ స్తోత్రం, చండీపద్యశతి, కామాక్షీ (మూక) పంచశతి, శివపంచస్తుతి, శ్రీ గిరిమల్లికార్జున స్తవం, శ్రీ శైల మల్లికార్జున సుప్రభాతను సాంధ్యం, మార్కండేయం, ఉద్భటుని ఉపనయనం, మల్లికార్జున పండిత విజయంకాశీశ్వర మహాత్మ్యం మున్నగునవెన్నో లఘు కృతులు రచించారు. సుబంధుని వాసవదత్తను ప్రౌఢ ప్రబంధంగా తెలుగు చేశారు. జయంతి సమసాయయిక ఖండ కావ్య సంపుటి, ముదిగొండ వారి దృష్టి చరిత్ర వైపు మరలింది. స్వాతంత్ర్యోద్యమ చరిత్రను చిత్రించారు. కాకతీ ప్రభువుల ప్రాభవాన్ని, మహామరకత' కావ్యంగా సంతరించారు. ఆంధ్ర కేసరి జీవితాన్ని ఆశువుగా చెప్పారు. సింహాయా తిరుగుబాటును "భారత స్వాతంత్ర సంగ్రామము" అని కీర్తించారు. ముదిగొండ వారి మహా కావ్యం "వందేమాతరం". ఇది 1860 నుంచి 1906 వరకు జరిగిన స్వాతంత్ర్యోద్యమ చరిత్రకు భక్తి మయ సత్యమయ కళా స్వరూపం. దీనిని ముదిగొండవారు మహాకవిత్వ దీక్షావిధితో నిర్మించారు. ఈ మహా కావ్యంలోని పద్యాలు

క్రమంపున్ ఎలపుకొ వెలార్చినవి ప్రా
　గ్భావమ్ముగా దేశ భ
క్తి ప్రాసాదమునందు నెన్నడులు వం
　దే మాతర మ్మంచు భా
వ ప్రౌఢిన్ ప్రకటింప జేసినః శోభల్
　దక్షిణంబందు నాం
ధ్ర ప్రాశస్త్యము మెట్లు కట్టినది స్వా
　తంత్ర్యాద్రి కావైపుగా

అంటూ కవితా ప్రాసాదానికి, ముదిగొండ వారి కీర్తి ప్రాసాదానికి మెట్లు కడతాయి. ఐదువందల పుటలు ఈమహాకావ్యం చివర వీరభద్రుడిదిద్రా సెను మానెను దేశ భక్తి చూడామణి మానసమ్ములకు దప్పిక తీర్చితి నన్ను తృప్తినిస, అంటూ సంతృప్తి చెందుతూ

ప్రజా స్వామ్య ప్రభుత్వాయ
ప్రజాయై మంగళం సదా—
　నిస్స్వార్థేభ్యం ప్రజా సేవా
నిరతేభ్యశ్చ మంగళమ్

అని మంగళం పాడారు. శివభారతం తరువాత వచ్చిన నవభారతం 'వందే మాతరం'' ఉద్యమాల చరిత్రలో దీనిది అగ్రతాంబూలం. దీనికి 1981లో రాష్ట్ర సాహిత్య అకాడెమీ బహుమతి లభించింది 1980లో రాష్ట్ర సాహిత్య అకాడెమీ ముదిగొండ వారిని విశిష్ట సభ్యత్వంతో సన్మానించింది.



శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి

ఇటీవల ముదిగొండవారిని కలుసుకొన్నప్పుడు ''ఇదే కవితావేశంతో సెంచరీకొట్టేయండి'' అన్నాను. ''ఆ పరమేశ్వరుని దయ'' అన్నారు సరసత గల వారు. అనాయాసంగా సెంచరీ కొడతారనే నా నమ్మకం. అన్నట్టు మరచాను, ఇంతటి వీర శైవులైన ముదిగొండవారు చిక్కని కవిత్వంతో చక్కని వేణుగోపాల శతకం వ్రాశారు. దాని లోని పద్యమైనా మీరు వినకపోతే ఎలా?

త్రాటన్ గట్టగవచ్చునే నిఖిల బం
ధచ్ఛేదకుని నిన్ను? నిన్
రోటం గట్టగ త్రాళ్ళు చాలక వగ
ర్చున్ దల్లి ముగ్ధాత్మయై
యేటా టొంకులు లేని నిర్మల మన
స్సే బంధమై యామె యా
రాటమ్మౌట కీవు చిక్కితి లే
రా వేణుగోపాలకా

**రాయలసీమకు ఆశాకిరణం :**

కేంద్ర హోం శాఖా సహాయమంత్రి శ్రీ పెండేకంటి వెంకటసుబ్బయ్య జనవరి 11న ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పెనిన్సులర్ జియాలజీ ఆధ్వర్యంలో జరిగే రెండు రోజుల వర్క్‌షాప్‌కి ప్రారంభోత్సవం జరుపుతూ, విజ్ఞాన శాస్త్ర ఫలితాలు గ్రామీణ ప్రాంతాలకు చేరినప్పుడే దేశంలో ఆర్థిక తారతమ్యాలు తొలగిపోగలవన్నారు. ఈ వర్క్‌షాప్‌లో కడప బేసిన్‌కు చెందిన వివిధాంశాలపై చర్చ జరిగింది. కరువు కాటకాలతో సతమతమవుతున్న రాయలసీమ ప్రజలకు ఇప్పుడిప్పుడే కడప బేసిన్ సంగతి తెలిసి ఆశలు చిగురిస్తున్నాయని, శ్రీ వెంకటసుబ్బయ్య అన్నారు. సంస్థ అధ్యక్షుడు ప్రొఫెసర్ కరుణాకరన్ ప్రసంగిస్తూ కడప్ బేసిన్ వంటి బేసిన్ ప్రపంచంలో మరెక్కడా లేదన్నారు. కడప బేసిన్ దేశవిదేశ భూగర్భ శాస్త్రజ్ఞుల దృష్టి నాకర్షించినందుకు అభినందిస్తూ ఈ సంస్థకు రాష్ట్ర ప్రభుత్వం అవసరమైన ఆర్థిక సహాయం చేస్తుందన్నారు.

**ఉపశ్రుతి :**

వెంకట్రామా పేపర్ ప్రొడక్ట్స్‌లో ప్రూఫులు చూసుకుంటున్న ఒక రచయితను చూచి 'పాపం చాల కష్ట పడుతున్నారు' అన్నాను. 'పాపం చేయాలన్నా కష్టపడక తప్పదు గదా' అన్నారు యువ మిత్రుడు శ్రీ వి. సాయిబాబా. ●



**వనితలకు మనవి**

కొత్తరకం వంటలు
క్లుప్తంగా రాసి పంపితే
త్వరగా పరిశీలించ వీలవుతుంది. —సం:

# "రోజులో ఏ సమయంలోనైనా గ్యాస్

## ఈ ప్రమాదం నుంచి రక్షణకు మీకు మార్గం యిదిగో !

"జఠరాగ్ని అనగా జీర్ణశక్తి తగ్గిపోయినప్పుడు మనం తినే ఆహారం సరిగా సకాలంలో జీర్ణంకాదు. అలా జీర్ణంఅయి కాని ఆహారం కడుపులో పులిసిపోయినప్పుడు గ్యాసు ఉత్పత్తి చేస్తుంది. ఈ తప్పుడు గ్యాసులవల్ల త్రేపులు వస్తాయి. గుండెనెప్పి, తదితర తీవ్ర బాధలు వస్తాయి. గ్యాస్ ట్రబుల్ ప్రధాన లక్షణాలివే. శరీరానికి ఎండ వేడిమి, అగ్నివేడిమి సోకినా లేక తంబాకు నమలడం, పొగ పీల్చడం వంటి పనులు చేసినా, మిరపకాయలు, ఇంగువ, చింతపండు, ఉల్లిపాయలు, సారా, తేయాకు, కాఫీ, మజ్జిగ, పెరుగు, దుంపకూరలు, బఠాణీలు, ఎండు చేపలు మొ. వాటిని మనిషి శరీర స్థితిని నిర్లక్ష్యం చేసి తినినా, కడుపులో పైత్యరసం అతిగా ఉత్పత్తి అవుతుంది. ఈ రసం పైపొత్తి కడుపులోను, గుండెలోను బాధ, మంట పుట్టిస్తుంది. కడుపులో ఆహారం పులియడం వల్ల పుల్లత్రేపులు రావడం ఆహారం జీర్ణం కాని రుచి, చేదు వగైరాలుంటాయి. పై పొత్తి కడుపులో ఈ గ్యాస్ నిలిచిపోయి చలి,జ్వరం మత్తుగా ఉండటం వంటివి కలుగుతాయి. క్షీణించిపోయిన పైత్యరసం ప్రేవులలో ప్రవేశిస్తుంది. ఇది విద్యుచ్ఛక్తివలె ప్రయాణించే గ్యాసును ఉత్పత్తి చేస్తుంది. ఈ గ్యాస్ మెదడుకు గుండెకు, హృదయకోశానికి విద్యుత్ వేగంతో వ్యాపిస్తే రోగి మత్తుగా స్పృహ కోల్పోయినట్లుగా, గుండె చుట్టూ నొప్పి ఉన్నట్లుగా ఫీలవుతాడు. ప్రేగులలో పేరుకుపోయిన మలం, గ్యాస్ ఒత్తిడివల్ల పెడక్కిన గ్యాస్ ప్రేగులగుండా ప్రయాణించడంతో వైకంగా ఉండడం, స్పృహ కోల్పోవడం, గుండెనెప్పి, ఇతర పరిస్థితులు ఏర్పడతాయి. వీటన్నింటిని సమష్టిగా కలిపి "గ్యాస్ ట్రబుల్" అంటున్నారు.

### గ్యాస్ ట్రబుల్ మూలంగా ఇతర చిక్కులు

పొత్తి కడుపులో తప్పుడు గ్యాసులు అతిగా ఉత్పత్తి కావడంవల్ల, తేలికగా ఆహారం తీసుకున్నా కడుపు ఉబ్బరంగా ఉన్నట్టు ఫీలవుతాము. కడుపులోని వివిధ భాగాల నుంచి చిన్న శబ్దాలు, పెద్ద శబ్దాలు, కడుపులో మంట కడుపులో నీరు కలిగిన ఫీలింగ్, గుండె మంట, గొంతు మంట, గ్యాస్ శబ్దం చేస్తూ పైకి కిందికి సంచలనం, కఫం పడటం, తరచుగా మల విసర్జనకు పోయే దరణి, గుద ములో మంట, తరచు మూత్ర విసర్జన. తరచుగా తినాలనే కోరిక, పుష్టికరమైన ఆహారం తీసుకున్నా, శారీరక బలహీనత, ఆకలి లేకపోవడం, అతిగా ఆకలి వేయుటం దగ్గు, వాంతులు మొదలైనవి సంభవిస్తాయి. కడుపులో గుచ్చినట్లు బాధ, చీమలు ఇతర క్రిములు కుట్టిన ఫీలింగ్, గుండెలో తేలికగా ఉన్న భావన, గుండె కొట్టుకోవడం ఎక్కువ కావడం, కష్టించి పనిచేసినతర్వాత కడుపులో గ్యాస్ పేరుకుపోవటం, మత్తుగా ఉండటం తలలోని వివిధ భాగాలలో తీవ్ర నెప్పి, కంటి చూపు లోపించడం, కళ్ల మంటలు, కళ్ల వెంట నీరు కారడం, సరిగా వినకపోవడం, చెవులు దిబ్బళ్లు పడటం, చెడు కలలు ఉదర కోశంలో గ్యాస్‌తో బాధపడే చాలామంది రోగులు చెడు కలలతో నిద్రిస్తుంటారని అనేకమంది అనుభవంవల్ల తెలుస్తున్నది. శబ్దం పట్ల అసహనభావం. ఎప్పుడూ పడుకుని ఉండాలనే వాంఛ. నడిచేటప్పుడు గుండె త్వరగా కొట్టుకోవటం. గొంతులో కల్లె, పట్లో ఉమ్మి పూరటం, నాలిక మీద పాచి,నోట్లో దుర్వాసన, నిద్ర లేకపోవటం,తల నొప్పి,జలుబు, ఆయాసం,కీళ్లనెప్పులు అతి దాహం, ఆలోచనాశక్తి లోపం ఒంటరిగా ఉండాలనే వాంఛ. జ్ఞాపకశక్తి లేకపోవటం, దృఢనిశ్చయం లేకపోవడం కోర్కెలను అణచుకొనే శక్తి లేకపోవడం ముక్కుమీద కోపం ఇలాంటి దుఃఖభాజనకమైన లక్షణాలతో బాధపడుతున్నవారు అసంఖ్యాకంగా ఉన్నారు.

ఈ లక్షణాలు ఒకటొకటిగా ఉండవచ్చు లేక కలిసి ఉండవచ్చు. శాశ్వతంగా ఉండవచ్చు. తాత్కాలికంగా ఉండవచ్చు. ఆయుర్వేద శాస్త్రం ప్రకారం అన్ని రోగాలు త్రిదోషాలు [వాతం, పిత్తం, కఫం తో] వ్యత్యాసం వల్ల సంభవిస్తుంటాయి. వాటిలో మొదటిది అనగా వాతం చాలా ముఖ్యమైనది. ఈ దోషానికి గ్యాస్ పేరుకోడానికి సంబంధం ఉంది. ఆటంకపరచబడిన గ్యాసును శరీరం నుండి ఏ మార్గం ద్వారా వదిలేసినా రోగి ఎంతో హాయిగా ఫీలవుతాడు. పొత్తి కడుపులో అతిగా గ్యాస్ పేరుకుపోవటం, అది బైటికి పోకుండా ఆటంకం ఏర్పడటం అన్ని లక్షణాలకు మూల కారణమని స్పష్టమవుతున్నది.

### "గ్యాస్ట్రో9"

ఒకే రకపు జబ్బులకు ఒకే రకపు చికిత్సలున్నాయి. కొన్ని రోగాలు అనేక చికిత్సలు కలిసి చేస్తేనే కాని అవి కుదరవు. అనేక వ్యాధులు చేతే కొన్ని ప్రత్యేక చికిత్సలున్నాయి. గ్యాసువల్ల కలిగే అన్ని రకాల రోగాలకు లక్షణాలకు "గ్యాస్ట్రో9" ప్రత్యేక చికిత్స శరీరానికి అవసరమైన వాత, పిత్త, కఫం, వంటి ప్రధాన శక్తులు పెరిగినా, తరిగినా వ్యాధులు సంక్రమిస్తుంటాయి. తెలుసుకోలేనివారు ఒకే ఔషధం అనేక రోగాలను కుదర్చ కలదని నమ్మడం కష్టమవుతుంది. ఇందుకు వారిని నిందించరాదు. వారిలో దోషం లేదు. అలాంటి వారికి "గ్యాస్ట్రో9" వాడి చూసి, సంతృప్తి పొందుతారో లేదో పరీక్షించుకోమని సలహా ఇవ్వాలి. మీవు గ్యాస్ట్రిక్ రోగమైతే దీనికి చికిత్స లేని రోగమని మాత్రం భయపడవద్దు. వాస్తవానికి ఈ నమ్మకానికి సంబంధం లేదు. "గ్యాస్ట్రో9" దీనికి ఉదాహరణ. మీవు ఆరోగ్యంలో ప్రతిఘటన శక్తులున్నాయి అని మీకు తెలిసినట్లే "గ్యాస్ట్రో9"లో గ్యాస్ట్రిక్ రోగాలను, అనుబంధ వ్యాధులను కుదర్చగల శక్తి ఉడిగిపోయినపుడు శారీరక మానసిక ఆరోగ్యాన్ని నిలబెట్టడానికి, వయసు ముదిరిన కొద్దీ శరీరంలో శక్తి తగ్గిపోతున్నప్పుడు ఇలాంటివాటికి పురాతన ఆయుర్వేద పండితులు అమూల్యమైన మూలికలు, ఇతర వస్తువులు ఎటువంటి వ్యాధులనైనా కుదర్చగల ఔషధాలు సూచించారు.

నేటి అవసరాలను పరిణితి పొందుతున్న పరిస్థితులకు సంబంధించిన పరిశోధనలను స్పష్టంగా చదివి వర్గీకరించిన తరువాత అద్భుతమైన ఈ "గ్యాస్ట్రో9" ఔషధం తయారు చేయబడింది. మేము ప్రత్యేకంగా తయారు చేసిన "గ్యాస్ట్రో9"ను మీరు వాడడం ప్రారంభిస్తే పైన తెలిపినటువంటి



# వంటలు

## 'కోడ్ బళె'

కావలసిన వస్తువులు : మైదా – పావు [అంటే 1 గ్లాసు మైదాకి అరగ్లాసు బియ్యప్పిండి], బియ్యప్పిండి – నవటాకు [కొట్టినదైనా లేక మరదైనా] పచ్చిమిర్చి కొత్తిమీర, జీలకఱ్ఱ – 1 చెంచా, సరిపడఉప్పు, కొంచెం ఇంగువ ముక్క నీళ్ళలోవేసి నలపాలి. నూనె – నవటాకు.

చేసే విధానము : ఒక బేసినులో కొంచెం నీళ్ళుపోసి మైదా, బియ్యప్పిండి పొయ్యాలి. పచ్చిమిర్చి, ఉప్పు జీలకఱ్ఱ, కొత్తిమీర రోట్లో వేసి మెత్తగా ముద్దలా నూరి వుంచుకోవాలి. ఈ ముద్దని కూడా బేసినులో వేసి, ఇంగువముక్క తీసేసి ఆ నీళ్ళు ఇందులో పొయ్యాలి. అరకప్పు నూనె బాగా కాగబెట్టి ఆ నూనె యీ పిండిలో పోసి దీన్ని పూరీ పిండిలా కలిపి బాగా మర్దించాలి. కోడ్ బళె క్రిస్పీగా వుండాలంటే పిండి మర్దించడంలోనే వుంటుంది. ఇప్పుడు ఆ ముద్దని చిన్న ఉసిరికాయంత వుండ తీసుకుని పీటమీద రెండు చేతులతో అటు ఇటు తిప్పితే పొడుగ్గ వస్తుంది. దీన్ని మన చేగోడీలలా రెండు మూడు రౌండ్లు తిప్పి చుట్టాలి. ఇలా అన్ని చేగోడీలు చేసి వుంచుకుని, బాణలిలో నూనెపోసి కాగాక, 6 చేగోడీల చొప్పున వేసి మీడియమ్ ఫైర్‌మీద వేయించి చల్లారాక డబ్బాలో వేసుకుంటే పది రోజులు నిలవ వుంటాయి. మనకి కాఫీ పక్కన, పిల్లలు ఇష్టపడే వంటకం. తినటానికి గరగరలాడుతూ చూడటానికి ఇంపుగా వుండే వంటకం.

— ఏ. అరుంధతీరావు

## మైదా అరటికాయలు

కావలసిన వస్తువులు : మైదా అరకేజి, పంచదార – అరకేజికి కొంచెం తక్కువ, అరకేజి డాల్డాగాని, రిఫైండ్ ఆయిల్‌గాని, కొద్దిగా ఏలకులు.

చేయు విధము: మనం చేయుటకు రెండు గంటలు ముందుగా అరకేజి మైదాపిండిని బాగా జల్లించి పురుగులులేకుండా చూసుకుని కొంచెం ఉప్పు, 4. 5 టేబుల్ స్పూన్ల డాల్డాగాని, రిఫైండ్ ఆయిల్ గాని వేసి నీళ్ళుపోసి మెత్తగా పూరీల పిండిలాగా కలిపి మూతపెట్టి రెండు గంటలసేపు ఉంచవలెను.

తరువాత చిన్నచిన్న పూరీల క్రింద వత్తి, పూరీ చుట్టు చిరగకుండా మధ్యన 5, 6 వరుసలు కత్తితో గాట్లు పెట్టి దానిని చుట్టుకుంటూ మడిచి రెండు పక్కలా అరిటికాయ ముచ్చికలాగ గట్టిగా నొక్కవలెను. ఈ విధముగా కలిపిన పిండి అయే వరకు అన్నీ చేసుకుని ఒక ప్రక్కగా పెట్టుకోవలెను. పూరీలవలె అంటే లావుగా చేయకూడదు. పల్చగానే వత్తవలెను.

తరవాత స్టౌ అంటించి ఒక స్టీలుగిన్నెలో అరకేజికి తక్కువ పంచదార పోసి పంచదార కరుగువరకు సన్న సెగమీద, ఏలకులపొడి వేసి కలిపి అట్లాగే ఉంచవలెను. ఇంకొక స్టౌమీద బాణలి పెట్టి అరకేజి డాల్డాగాని, రిఫైండు ఆయిలుగాని పోసి బాగా కాగిన తరువాత కోసి అరటికాయల క్రింద తయారు చేసుకున్నవి రెండేసి చొప్పున వేసి గోధుమ రంగుగా వేయించి తీసి వేడిమీదనే పంచదార పాకంలో వేసి క్రింద, పైన ఒకసారి కలిపి వెంటనే తీసేసి వేరొక పళ్ళెంలో పెట్టవలెను. అట్లాగే అన్ని అరిటికాయలను వేయించి వేడిమీదే పాకంలో వేసి వెంటనే తీసేయవలెను. ఇవి చాలా తొందరగా వేగిపోవును. పంచదార పాకంలో కొద్దిగా ఆకుపచ్చరంగు వేసి కలుపుతే నిజంగా అరటికాయలవలె చూచుటకు బాగుండును, పాకంలో ఊరి తినుటకు చాల రుచిగా వుండును. తయారు చేయుట కొంచెం కష్టమైనా వేయించుట చాల తేలిక.

— కిళాంబి సత్యవతి

# అపీ ఇపీ అన్నీ

## ఫ్రీవర్స్ ఫ్రంట్ బహుమతి

1981 వ సంవత్సరానికి ఫ్రీవర్స్ ఫ్రంట్ బహుమతి ఈ యేడు ఉగాది నాటికి నిర్ణయిస్తారు. బహుమతి విలువ 500 రూపాయలు. 1979,1980,1981 సంవత్సరాల్లో యువకులు ప్రకటించిన ఫ్రీవర్స్ కావ్యాలకు యీ బహుమతి పొందే అర్హత వుంటుంది. దీని కోసం తమ కావ్యాలు పంపదలచిన వారు, ఫిబ్రవరి 28 లోగా 4 కాపీలు పంపాలి. చిరునామా: ఫ్రీవర్స్ ఫ్రంట్, ఎం. సి. 15, మలక్‌పేట్ కాలనీ, హైదరాబాద్—36. వివిధ కవుల రచనల సంకలనాలు బహుమతి పరిధిలో లేవు. ఏకకర్తృకమైన కవితాసంపుటాలు కూడ బహుమతికి అర్హములు అని ఫ్రీవర్స్ ఫ్రంట్ అధ్యక్షులు వ్రాస్తున్నారు.

## కాకినాడలో జేసుదాస్ మ్యూజికల్ నైట్

లయన్స్ క్లబ్ కాకినాడ అధ్వర్యంలో పబ్లిక్ స్కూలు (ఇంగ్లీషు మీడియం) స్థాపనార్థం ప్రఖ్యాత గాయకుడు జేసుదాస్ మ్యూజికల్ నైట్ కాకినాడ ఆనందభారతిలో ఫిబ్రవరి 7వ తేదీన ఏర్పాటు చేయబడింది. కోస్తా ఆంధ్రలో పబ్లిక్ స్కూలు ఆవశ్యకత ఎంతయినా ఉంది. ఈ కార్యక్రమానికి ప్రఖ్యాత సినీనటులు డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు ముఖ్య అతిథిగా వస్తున్నారు. మరి కొందరు ప్రముఖ తారలు కూడా ఈ కార్యక్రమములో పాల్గొంటారని క్లబ్ అధ్యక్షులు తెలియజేస్తున్నారు.

## తెలుగు బాలల రచయితల ప్రథమ మహాసభలు

తెలుగు బాలల రచయితల ప్రథమ మహాసభలు ఫిబ్రవరి 14న హైదరాబాద్‌లో జరుగుతాయి. తెలుగు బాలల రచయితల సంఘం, ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమీల సంయుక్త ఆధ్వర్యములో ఈ సభలు జరుగుతున్నాయి.

బాలల కోసం రచనలు చేస్తున్న ప్రముఖులను ఒక వేదిక మీదకు తీసుకు వచ్చే సదుద్దేశంతో మొదటి సారిగా ఈ మహాసభలు నిర్వహించబడుతున్నాయి. ఈ సభలలో బాల సాహిత్యములో వివిధ అంశాలపై చర్చలు, గోష్ఠులు జరుగుతాయి.

ఈ సందర్భంగా ప్రముఖుల ప్రసంగ — వ్యాసాలతో ప్రత్యేక సంచికతో పాటు, బాలల రచయితల జీవిత వివరాలతో కూడిన పుస్తకాన్ని కూడ ప్రచురించనున్నట్టు తెలుగు బాలల రచయితల సంఘం కార్యదర్శి శ్రీమతి డి. సుజాతాదేవి తెలియజేస్తున్నారు.
ఇంకా వివరాలకు కార్యదర్శి పేర ప్రకాశంరోడ్డు, విజయవాడ, 520002కు వ్రాయవచ్చు.

## అవీ...ఇవీ...అన్నీ

### కుమార సంభవము

కాళిదాసు సంస్కృత మూలమునకు శ్రీ గుర్రము వేంకట సుబ్రహ్మణ్యం తెలుగుసేత. 92 పేజీలు గల ఈ పుస్తకంవెల 6 రూపాయిలు. ప్రతులకు రచయిత పేర, వేదమువారి అగ్రహారము, నెల్లూరు అన్న చిరునామాకి రాయాలి.

### రాసలీలా పంచాధ్యాయి

రాసలీలలపై వ్యాఖ్యానము. వ్యాఖ్యాత శ్రీ పురాణపండ రామమూర్తి. 132 పేజీలు గల ఈ పుస్తకం వెల 5 రూపాయిలు. ప్రతులకు: శ్రీ పి. రాధాకృష్ణమూర్తి, డోర్ నెం. 29-6-13డి, జయశ్రీ టాకీస్‌రోడ్డు, రాజమండ్రి—4.

### విద్యార్థి

పద్యకావ్యము. రచన : శ్రీ వారణాసి సత్యనారాయణ. 32 పేజీలు గల ఈ పుస్తకంలో విద్యార్థులని వివేకవంతులుగా తీర్చిదిద్దే అనేక విషయాలని 108 తేట గీతులలో చిత్రించారు. వెల 2 రూపాయలు. ప్రతులకు : శ్రీ వి. ఎస్. ఆర్. మూర్తి, 2/33, పండరిపురం, చిలకలూరిపేట-522616.

### శ్రీరామ శతకము

రచన: శ్రీ వారణాసి సత్యనారాయణ. 30 పేజీల ఈ పుస్తకం వెల రెండు రూపాయలు. ప్రతులకు : శ్రీ వి. ఎస్. ఆర్. మూర్తి, 2/33, పండరిపురం, చిలకలూరిపేట-522616.

### ఆంధ్ర గీతాంజలి

రవీంద్ర కృతికి స్వేచ్ఛానుకృతి. అనువాదం: శ్రీ అగస్త్యరాజు సర్వేశ్వరరావు. 120 పేజీలు గల ఈ పుస్తకం వెల 8 రూపాయలు. ప్రతులకు : శ్రీమతి అగస్త్యరాజు వైదేహి, కేరాఫ్ గుంటూరు హనుమంతరావు, హనుమాన్ మెడికల్ స్టోర్స్, అద్దంకి—523201.

### దేవుడా నువ్వెక్కడ ?

నాటిక. రచన: శ్రీ బసువుల సత్యనారాయణ, 48 పేజీలుగల ఈ పుస్తకం వెల నాలుగు రూపాయలు. ప్రతులకు : నవీనసాహితి, పిడుగురాళ్ళ, గుంటూరు జిల్లా.


Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor . S. Radhakrishna.

